About a month back, while Yella Reddi and myself were sitting in the porch of my house and conversing on various topics, Nagi Reddi came there and said " Yella Reddi, do you think that it matters little whose the bull was, and if the cow calves in our herd it is all right? What have you agreed to at the recent caste meeting, and what do you mean by living with her now?" Then Malla Reddi happened to arrive and he said "where there is no calf, the milk is got with pain; why do you ask him to lose the wife he has?" I said "what is past is past, why should she be turned out (of the family)?; However, if the suggestions of the Chetti are not complied with, he will have the matter again brought to arbitration. You (had better) cause Rosi Reddi's daughter settled (to be married), and I shall see that the marriage is performed.'" Subbayya, the village purohit, who was then driving his he-buffalo to the herd, asserted that he would obstruct Rosi Reddi's daughter being offered (in marriage). Yella Reddi started up saying "feeding the brahmin with ghee is like manuring the sandy ash-colored soil (without effect); these brahmins my wives always act in this manner. (They) eat away our rice in quantities and throw obstacles in our way?" The Brahmin said "You mad widow's son, you abuse me?" Thereupon, Yella Reddi held the Brahmin by the tuft, bent him and dealt him ten blows on the back with the fist; then laid him on his back on the ground, struck him on the belly with the elbow and the knees and saying "feel my blows, the slanting rain will not stop without immersing", dealt a volley of blows like thunder-bolts on the brahmin's face, nose, temple, and chest. Though we all interceded and got the brahmin free, he was not able to move from the place where he fell and was bleeding in the mouth and gasping (labouring for breath or breathing hard), all his teeth drawn out; he was in the same place for an Indian hour (24 minutes), after which he stood there and said "O! sinner, you were murdering the brahmin. You afflictor! You were born among the Yadavas (shepherd caste) as a pestle (to ruin the caste). You have been born of a cancer in your mother's womb (you do not possess the characteristics of a rational being) You murderer (villain)"; when Yella Reddi, saying "Fie, put the dung into your brahmin's mouth" jumped and kicked the brahmin on the left side of his belly, he fell down, turned pale, kicked his legs and expired before a hundred could be counted. In

a short while, the brahmin's wife Venka came lamenting and beating her own head and mouth in despair; she threw mud towards Yella Reddi's house, broke her glass bracelets and left cursing him.

## 1894.

మ-రా-రా-శ్రీ. మద్రాసు రివిన్యూబోర్డువారి సముఖమునకు, కృష్ణాజిల్లా పందిపాడు జమీందారు వ్రాసుకున్న అర్జీ.

1. మాతాలూకా యిలాకా కొన్ని గ్రామములు తాలూకా పూర్వము నీటివనరు చెడిపోయినమామూలు పల్లపు భూములకు నీటి పన్ను అక్కరలేకుండా ఆనికట్టు నీరు యిప్పించడమునకు తమరు చేయించియున్న తీరుమానమును అమలు జరుపుటలో యీ డిస్ట్రిక్టు కలక్టరువారు భిన్నతాత్పర్యముకలవారయి ఆ 1872 సంవత్సరం అక్టోబరు 25 తేదిని మాపేర వ్రాయించిన జవాబు యినాయతునామాను యిందుతో జతపరుస్తూ ఆ వాంశములో యీ క్రింద నుదహరించినసంగతులు తమరు పూర్ణముగా యోచనలోకి తెచ్చి సదరు గ్రామములో మొదటి రెండు గ్రామములు తాలూకు పూర్వపుపల్లపు సాగుబడి రుజావు అయిన మొత్తములో కొంతకు మాత్రమె బోర్డువారు తీర్మానించియున్నారు గనుక కనుపర్చబడిన లెఖరుజావును తిరిగి చిత్తగించి పూర్తిగా తీర్మానించుటకున్ను మా కోరికఅయివున్నది

2. ఈ అర్జీ మలూన్నాపులో నుదహరించిన ప్రకారం బోర్డువారు పల్లముగా తీర్మానించిన భూమి పరిమాణములు, ఆనికట్టు నీరు ప్రవహించక పూర్వము తయారు అయివున్న లెఖలలో నమోదుఅవుతూవచ్చిన లెఖలు తహ్వీలు మొత్తములయొక్క దృష్టాంతరములమీద మొకద్దపడి యుండుటచేత, తీరుమానపు మొత్తములును ఆనికట్టు నీటిసాగుబడియొక్క ద్వివిధపరిమాణములలో లెఖతహ్వీలు పరిమాణములలో మినహాయించడము న్యాయమయి యుండగా ఆనికట్టు నీరు ప్రారంభమయిన 1260, 1261 పసలీలకు భరిమిలాను 1265 సంవత్సరం మొదలుకొని చేయబడిన మహాతు తహ్వీలు పరిమాణములో నుంచి మినహాయించబడవలసినందుకు కలక్టరువారు తాత్పర్యపడడమువల్ల మాకు అన్యాయము సంభవించడమున్ను హేతువు అవుతూవున్నది.

3. సదరుహీ గ్రామములలో పెట్టనయున్న ఆయా గ్రామముల యకరములు మామూలుపల్లమని బోర్డువారు తీర్మానించినారు అనిన్ని ఖేతువారి విచారణచేసి తీర్మానించి యుండలేదనిన్ని కలెక్టరువారు స్థూల దృష్ట్యా తాత్పర్యపడియున్నారు

గాని ఖేతువారి విచారణ జరిపి యున్నదని యోచించుటకుగల హేతువులు యేమనగా. (1) యేలెఖ దృష్టాంతసుల వల్ల పూర్వపుసాగుబడిని గురించి రుజువుకలిగి బోర్డువారు తీర్మానించియున్నారో ఆ లెఖలలో మెరక పల్లం వివరములతో సంపులవారి విచారించబడే వున్నది (2) ఆ పంపులకే 1261 సంవత్సరములో యిస్టేటుకోర్టాపువార్డుసు వారి మేనేజిమెంటు క్రిందకు వచ్చినందున పబ్లికు ఆఫీసర్ల వల్ల నెంబర్లు వేయించబడి చెకుబందితో అజమాయిషి లెఖలు తయారు చేయించబడ్డవి. వాటికిన్ని అంతకు పూర్వపు లెఖలకున్ను భేదంలేదు. ఆ అజమాయిషి లేఖలలో మెరకపల్లపు విచక్షత ఆసరికి వుండే ప్రకారమె వ్రాయబడి వున్నది అదివరలో లెఖలలో నమోదు ఆవుతూవుండే మొత్తముకే అందులోనున్న నమోదు చేయబడ్డది (3) ఇప్పటికిన్ని లెఖలలో సదరుహి అజమాయిషి తహ్వాలు ఖేతులకుపూర్వము పల్లపు సాగుబడి అవుతూవుండే ఖేతులను మామూలు పల్లం అని వుదహరిస్తూ వున్నారు అనగా అజమాయిషి తహ్వాలు ఖేతులకు మెరక పల్లం వివరం వ్రాసే యెడల అనికట్టు నీటిపారుదలకు పూర్వము పల్లపు సాగుబడి అవుతూవుండే ఖేతులను మాత్రమె మామూలు పల్లము అని వుదహరిస్తూవున్నారు. అనికట్టు నీరు వచ్చిన తరువాత అందువల్ల పల్లపు సాగుబడి అయిన మెరక ఖేతులను మెరకపల్లమయినదని వ్రాస్తూవున్నారు. (4) చకుబంది యేర్పడి వుండుటవల్ల ఆయా ఖేతులకు స్పష్టమైనయేర్పాట్లు కలిగియున్నవి.

4. సదరుప్రకారం యేర్పడ్డ మామూలు పల్లపుభూములకు లెఖలు తహ్వాలు మొత్తములకంటె దరిమిలాను చేసిన మసాతువల్ల జాస్తి వచ్చినప్పటికి ఆజాస్తి మొత్తముకుకూడా మామూలు పల్లంలోదే ఆయినందుకుండే నిదర్శనములను యీ క్రింద నుదహరించడ మవుతున్నది. మాయొక్కయున్ను మారయితులయొక్కయున్ను దరఖాస్తులో మామూలు పల్లపుభూములయొక్క లెఖలుతహ్వాలు పరిమాణములను తెలియపరచినాముగాని మసాతు తహ్వాలు పరిమాణములను తెలియపరచి వుండలేదు. బోర్డువారి తీర్పు అందు మీదనే మొకద్దమయి వున్నది. (2) మసాతుస్న. 1268ఫసలీలో ప్రారంభమయినందున 1260, 1261 ఫసలీలకు పూర్వము ఆభూములకు మసాతు తహ్వాలుయెంత పరిమితి కాగలదో తెలుసుకోవడముకుగాని అలెఖలలో నమోదు చేయడముకుగాని నిమిత్తములేదు. ఆ లెఖలు నిదర్శనముగా కనుపర్చ వలసినప్పుడు అందులో నమోదయి వున్న మొత్తముకే మాదరఖాస్తులో కనుపరచడము విధాయక మయివుండే సంగతివిశదం కా గలదు. (3) అన్నిగ్రామముల తాలూకున్ను దరోబస్తు మామూలు పల్లపు భూమియీాసరికి పూర్తిగా మసాతు

అయి వుండనందున మహాతు ప్రకారం యెంతపరిమితిగా గలదో యేర్పడనే లేదు. (4) మా దరఖాస్తు మొత్తముకు సరియైన తప్సీలు మొత్తములుగల ఖేతువారి లెఖలు కలెక్టరు వారి ఆఫీసులో దాఖలయివున్నవి. వాటి పయిన పబ్లీకు ఆఫీసర్ల సంతకములు వున్నవి. ఆనికట్టు నీటి సాగుబడిని గురించి ప్రస్తుతము తయారు అవుతూ వుండే మహాతు లెఖలలోకూడా ఆ ప్రదేశమునకు లెఖలు తహ్వేలు మొత్తం యెంత అయినదిన్ని, విశరముగా వ్రాయబడుచూ వున్నది.

౫. పైన చెప్పబడినగ్రామములలో మొదటి రెండింటికి అవ శిష్టపు మొత్తములు కూడామామూలు పల్లంక్రింద తీరుమానము చేయుటకు తగిన రుజువులు కలిగి వున్నవి యే ఐంటె

6. ఈపయిన విశదపరచిన అన్ని హేతువుల వల్లను మాదరఖాస్తు న్యాయమయిన దయినట్టుబోర్డువారికి విశదములోకి వస్తుంది.

7 సదరు సంగతులు ఆలోచన లోకిరాక కేవలము మహాతును పట్టి పల్లపు భూమి ముజరాయిప్పిస్తామనే పక్షమున, కొన్ని లెఖలలోనుండే సాగుబడి భూమి యావరేజి చేసి ఆప్రకారముచేసిన భూమి మామూలు పల్లము క్రింద లేటు కలక్టరు వారున్ను అప్పటి శిరస్తాదారున్ను ఫయిసలుచేసిన విధం మారయితులకు శ్రమ పెట్టడముకు యెంతకఠినమయినదో ఆదేప్రకారం యీ మహాతుముజరా పద్ధతిన్నికఠినమయిన సబబే అని బోర్డువారు చిత్తగిస్తే విశదం కాగలదు ఇప్పటి ఫయిసలా అనేది శాశ్వతంగా వుండేది గనుక యిటువంటి సబబు తేలని యీ హంశములో యిక్కడుఅయినా కంట్రాక్టు వప్పుకుంటామని కలక్టరువారిపేర వ్రాయడముకు తగినదిగా నుండలేదుగాని ఈఅన్యాయమును గురించి పెనుగులాడుతూవుండే ఘనమైన బోర్డువారి ఆలోచనలోకి యిదివచ్చేలోగానే యెవరేజీపద్ధతినిపట్టి గతంలో యేడు సంవత్సరముల బాకి మారహితులవల్ల వసూలుచేయించినప్పుడు యేనిఘమైన లాచారి స్థితి వాళ్లకుకలిగినదో యిప్పుడున్ను ఆదేస్థితి కలుగుతున్నదని ప్రస్తుతంకంట్రాక్టుకు వప్పుకొనడమైనది.

8. కాబట్టి యీ అన్నిసంగతులున్ను ఘనమైన ఆలోచనలోకితెచ్చి సదరు అన్నిగ్రామములకున్ను మామూలు పల్లపు భూమియొక్క మొత్తము మహాతు తహవేలు భూమి మొత్తముతో నిమిత్తము లేకుండా లెఖ తహ్వేలు భూమి మొత్తములో నుంచి మినహా చేయించుటకు ఉత్తరవుచేయించవలెనన్ని మొదటిరెండు

గ్రామములకు అవశిష్టపు భూమి మొత్తముకూడా నీటిపన్నులోనుంచి మినహాయించు టకు ఉత్తరువులు చేయించవలెనన్ని కోరుతాను.

## Translation.

To The Board of Revenue,

The petition submitted by the Zemindar of Pandipadu, Kistna District.

1. In enforcing the decision passed by you in the matter of irrigating from the anicut, free of water-rate, the immemorial wet lands the irrigation sources of which have become ruined, in certain villages belonging to me, the Collector has put a wrong construction upon it and sent me his favor (order) dated 25th October 1872, and I enclose it herein. I request that, in consideration of the following facts and remembering that the Board's decision pertained only to the area proved to have been under wet cultivation in the first two of the said villages, the proof available from the accounts may be reconsidered and the matter definitely disposed of.

2. As the extents concluded by the Board as under wet cultivation—vide the enclosure herein, have been assumed upon the comparative figures adopted from the accounts compiled prior to the anicut water was taken (for irrigation), it would be reasonable to deduct such extents from the two classes of land cultivable from the anicut water as well as from the comparative figures extracted from the accouts; but as the Collector is of opinion that the extents will have to be deducted from the figures come to at the survey in fasli 1268, (a long time) subsequent to faslis 1260 and 1261 when the anicut water was taken (for irrigation), we are likely to be submitted to injustice.

3. The Collector has superficially viewed that the Board has decided that the areas situated on a higher level in the said villages are immemorially wet and that authority has not entered into field-war details (for the purpose) but the following grounds would suggest that an enquiry as to the fieldwar details, has been made:—(1) The individual shares have already been detailed, with the classification of dry and wet, in the very accounts upon the basis of which the Board has decided on proof of previous cultivation; (2) in respect of those

individual shares, numbers were assigned and estimation accounts with boundaries have been prepared by public servants, as they were under the management of the Court of Wards in fasli 1261, and no variations are traceable between them and the previous accounts. The classification of dry and wet adopted till then has been followed in the estimation accounts. The same total arrived at in the former was also come to in the latter; (3) Even now the fields cultivated as wet prior to the aforesaid estimation are shown as immemorially wet, those under wet cultivation prior to the irrigation by anicut water are alone classed as immemorially wet. The dry plots irrigable by the anicut water are noted as dry transferred to wet. (4) Owing to the kistence of boundaries, the fields are found to have been distinctly classified.

4. Even if there had been an excess arrived at in the extent at the later survey over that of the immemorial wet lands compiled as stated above, that such total of excess will pertain to the immemorial wet lands will be evident from the facts illustrated hereunder:—(1) In the application submitted by our ryots and ourselves, the extents of the immemorial wet lands alone were given and the survey extents were not referred to, and the Board based its decision on the former. (2) The survey commenced in 1268, and there is no scope to ascertain what they would have measured (according to the survey standard measurement) prior to faslis 1260 and 1261, and there was no necessity to enter such measurements in the accounts. It will be patent that when those accounts had to be referred to in illustration, we were bound in our application to point only to the total therein mentioned; (3) As all the immemorial wet lands in all the villages have not been completly surveyed, their extent according to the survey cannot be fixed; (4) the total fieldwar accounts with particulars corresponding to the extent given in our application have been filed in the Collector's office, and they bear the signatures of public officers. The total extent according to the accounts for the said locality are being entered in the survey accounts which are under preparation relating to the irrigation by the anicut water.

5. There are valid grounds for classifying the remaining extent in the first two of the aforesaid villages as immemorially wet and they are—

7

6. On the above grounds, the reasonableness of our application will be manifest to the Board.

7. Without considering the above facts, if a deduction is proposed to be allowed in wet lands basing the same merely on the survey, the method will not be less oppressive than that by which the late Collector and the then Sheristadar declared the immemorial wet land on an average of the arable land entered in certain accounts, thereby distressing our ryots and the Board will realise that the method of deduction on the survey extent was unjust. As the present settlement is likely to be permanent, though it does not seem expedient on my part in the matter in which such a ground is not yet found efficacious, to notify now at least to the Collector my acceptance of the contract, considering that my struggling in the matter will place me, before the matter is considered by the Honorable Board, in the same helpless state as my ryots were in when the arrears for seven years were previously collected from them on the basis of the average system, I have at present undertaken the contract.

8. I therefore pray that, in consideration of all the above circumstances, orders may issue to the effect that, the total extent of the immemorial wet land, irrespective of the total survey extent, may be deducted from the total extent arrived at from the accounts, and that the remaining extent in the first two villages may not be included in the extent liable to water-rate.

## 1895.

Translate into English:—

మ-రా-రా-శ్రీ, శిరస్తం సూపరింటెండెంటు దొరగారి సముఖమునకు, కాపురస్థులున్ను యీదిగువను వ్రాళ్లు సంతకములు చేసిన వారు వ్రాసుకున్న అర్జీ విన్నపములు—

(a) యీ బస్తీలో మేము చాలా కాలమునుంచి కాపురముండి వర్తకము చేసుకుంటూవుండికొ స్త్రాలకు యీ రేవున సరుకులు యెగుమతి చేసుకుంటూ వున్నాము. ఇదివరకెన్నడున్ను యీరేవున దిగుమతి సరుకులకు రుసుము పుచ్చుకోవడం లేని సంగతిలో యిప్పుడు తమ వుత్తరువులయినదని రేవు అభివృద్ధి ఫన్ను అని పేరుబెట్టి బస్తా 1-కి రు 0-0-2 చొప్పున వసూలు చేస్తూవున్నారుగాని రేవుయొక్క అభివృద్ధి యంతమాత్రమున్ను చేయించబడి యుండ లేదనే సంగతిలో మేము వేరే మనవిచేయవలసినదిలేదు. యీరేవులో నడలుచేసేటప్పుడున్ను బాటసార్లు స్టీమరుకు

వెళ్లేటప్పుడున్ను స్టీమరువద్దనుంచి రేవుకువచ్చేటప్పుడున్ను కలుగుతూవున్నయిబ్బంది యింతనివ్రాయచాలను. తమరు ఇక్కడికి కొత్తగా దయ చేసినారు గనుక ఈరేవులో వున్న చిక్కులు తమకుయింకా ముందు విశదం గాగలవు. పడవలు స్టీమరు వద్దకు వెళ్లడముకు ముందు కొంతదూరము కాల్వకుండానున్ను తరువాత సముద్రపు చింక గుండానున్ను వెళ్లి సముద్రము లోకి ప్రవేసించబొయ్యేచోట వక గండి దాటి కొన్ని మయిళ్లు వెళ్లితేనేగాని స్టీమరు వద్దకు వెళ్లడం సంభవించదు. యిదిగాకగండి వద్దకు పడవలు చేరేవరకు సముద్రం పాటారి వున్నయెడల అక్కడ పడవలు తాకి కొన్ని గంటలవరకు అనగా తిరిగి పోటు భర్తి అయ్యేవరకు అక్కడ పడియుండవలసి వస్తున్నది. సరుకుల పడవలుఅక్కడ నిలుచుటవలన అంతయిబ్బంది లేక ఫోయినను బాటసార్లు యెక్క పిన్నీసులు సముద్రము యొక్క పోటుకు నిల్వడం చిక్కక అటూ యిటూ యెగిరెగిరి పడుతూ వుండుటచేత బాటసార్లకుశరీరము తిరిగి వమనములు చేసుకొని నానాభీభత్సు అయి కొందరికి స్మారకంకూడా తెలియక సకల అవస్థలుపడుచున్నారు. యిన్ని తింటాలుపడి స్టీమరు వద్దకు వెళ్లే వరకు అప్పుడప్పుడు స్టీమరు వాళ్లు లంగరు యెత్తి ఆగకుండా పోవుటకూడా సంభవ మవుతూవుంటుంది. అట్లా జరిగినప్పుడు తిరిగి యీ యవస్థలన్ని పడి ముక్కన ప్రాణములతో వడ్డుకు చేరడం అవుతుంది. యిదియుగాక కొన్ని ఋతువులయందు యీ రేవులో విశేషముగా అల దుర్సుగా నుండుటచేత పడవలు గానిపిన్నీసులుగాని స్టీమరుకు పట్ట జాలకుండా పోవడంకూడా వుంటుంది. యీ రేవు చాలాదూరమువరకు మెట్టగా నున్నందున స్టీమరు చాలా దూరములో లంగరు వేయుటవలన సరకులు యెగుమతి దిగుమతీలలో విశేషకాలము పట్టుటవలన అప్పుడప్పుడు నడపడవలు రాత్రులు రేవుకు రాకుండా సముద్రములోనే వుండడం సంభవమవుతూ వున్నందున పడవలమీద నుండే పల్లెకారీలు పడవలలోనుండి ఆమాంబాపతు సర్కులు విశేషముగా చోరీ చెయ్యడం జరుగుతూ వున్నది. యీ సరుకులు చాలాభాగంఆముదాలు మొదలగు గింజలు అయి వుంటవి. యీ చోరీ సొత్తు వక వేళ పడవల వాళ్లయిళ్లల్లోపట్టుకున్నప్పటికి మేజ'స్ట్రీటులువారి విచారణలో ఆసొత్తు మీద యేమి ఆనవాలు వున్నదని కేసులు కొట్టివేస్తూ వుంటారు. అందువలన యీ చోరీ చేసే వాళ్లకు మరి అలుసుగా వుంటుంది. యీ యిబ్బందులన్ని గవర్నమెంటు వారు విచారించక పోవుట వలన యీ రేవులో యే విధమయిన సంరక్షణ లేకుండా వున్నది. యీ రేవున సర్కులు యెగుమతి దిగుమతి చేయుట పడవవాళ్లయిన పల్లె

కారీలలాభము కొరకు అయి వున్నదిగాని వర్తకుల లాభంకొరకు అయివుండలేదు. యిదివరలో కొందరుయింజనీర్లు వచ్చి గండిన్ని స్టీమరుకు వెళ్లే చుట్టుదారిని చూచి గండి తెగకొట్టి నప్పటికి నీటి వడిజాలును బట్టిచూస్తే మళ్లీ అక్కడనే మెట్టవేస్తూ వుంటుందనిన్ని ఆ ప్రకారము చేయడమువలనవినియోగము లేదనిన్ని యీరేవు చోటు తప్పించి స్నానాల రేవుపద్ద యెగుమతి దిగుమతి యేర్పరిస్తేఅక్కడ యీ చోరీలు యిబ్బందులు లేకుండా వుండుటయేకాక స్టీమరుకూడా అక్కడికి సామీప్యముగా వుంటుందనిన్ని ఆలోచించినారు గాని క్రియకు యేమిన్ని కనుపించలేదు. ఇక్కడికి రయిలు అయినా వస్తే యీయిబ్బందులు నష్టములులేకుండా పోతవేమో యనియాలోచిస్తే సదరహీ మరాటావారు తాము రయిలువేయుటకు సిద్ధముగా వున్నామని చెప్పుతూవున్నప్పటికి గవర్నమెంటువారు వుత్తరువు యివ్వడం కష్టముగా నున్నది. యిదిరేవుస్థాన మవుటవలన రాజకార్యసంబంధమయిన యాలోచనలను బట్టి సన్నదారిగల సదరహీ మరాటా వారికియిచ్చుటకంటె యీస్టుకోస్టు లయినుకు కలిసే వెడల్పుదారి యుండుట వుచితమని గవర్నమెంటువారు యెంచే యెడల సొమ్ము విషయమయి యిప్పుడు గవర్నమెంటువారికి వుండె జరూరును బట్టిచూస్తేఆలా గవర్నమెంటు వారు యింతలో వేసేటట్టు కనుపించదు గనుక ప్రజా సౌఖ్యమును ఆలోచించేయీ గవర్నమెంటు వారు సదరహీ మరాటా వారికి శల్వ్యఅయినా యిస్తె గొప్ప వుపకారమునుచేసిన వారవుతారు. యిక్కడను రయిలు పడుటవలన యీవయిపు వాళ్లకు అందరికి సవుఖ్యకారణమె కాకుండా కరువువచ్చినప్పుడు యీవయిపు వూళ్లలోనుంచి అమితముగా ధాన్యం సమకూర్చ అవుటచే కరువు దేశపు ప్రజను గవర్నమెంటు వారు కాపాడినవారవుతారు, గనుక యివియన్నియు విచారించి తగుపనిని చేయించుదురని తమ ఘనమును మిక్కిలి వేడుకొనుచున్నాము.

(b) యీసంవత్సరములో యీతాలూకాపయిర్లు వగయిరాలు యేలావున్నదని తెలియపరచ వలసినదిగా తమరు గడచిన నెలలో సాదరుచేయించిన హుకుంను యిదివరకు జవాబు వచ్చియుండలేదనే మొదలయిన సంగతులతో తమరు యీ నెల 6 తారీఖున దయచేయించిన వుత్తర్వు ననుసరించి విశదపర్చునదేమంటే.

యీ సంవత్సరములో సకాల వర్షములు లేనందున కొన్ని మెట్టగ్రామాదులలో పంటలేతఅయినది, కొన్నిచోట్ల భూమి దున్నడమునకు ప్రయత్నము చేసినప్పటికి భూమి బిగుసుకుని వున్నందున నాగలికఱ్ఱ భూమిలో బాగుగ దిగక నాగలి

సొలుపడుట యే కష్ట మయినది. నువ్వు, బొబ్బెర, మినుము, ఆముదాలు వీట్లను తెగులు తగిలినది. వెర్రి తెలలు వేసి చాలాభాగము చెడిపోయినది. పూనాస భాగుగనే యున్నది. మామూలు పల్లం-బాపతు పల్లం భూముల సాగు విషయములో కాల్వలనీరు సకాలములో వచ్చినందున ఆకు మళ్లు వేసుకొనుటచే ఆకు అక్కరకు వచ్చి నాటు వెయ్యబడ్డది. యిద పయిర్లుసుమారుగా నున్నవి. జమీందారీ వూళ్లలో కొన్నిటిలో అగ్రహారీకులకున్ను జమీందారుకున్ను పుట్ల కట్టుబడి విషయమయిన తకరారు ఫయిసలు కానందున వాళ్లభూములకు నీటి దరఖాస్తులు చేయక సాగుబడి చెయ్యలేదు, గత ఫసలీలలో సాగు అయిన కొన్ని భూములు యీ సంవత్సరం కొల్లేటి ముంపులో నున్నందున సాగు కాలేదు. చిన్నివాడ గ్రామంలో వుండే అనాదిబంజరు భూములకు యీ సంవత్సరం కొందరు వాయకారీ రహితులు దరఖాస్తులు చేసుకొని వున్నందుకు మంజూరు నిమిత్తము యేలినవారికి విశదపరచుకొనివుంటే వుత్తరువు వచ్చియుండనందున సాగు కాలేదు. పోరంబోకులలో నుండే తాళ్ల మోతరఫాను గురించి యీ సంవత్సరం కలాలీలు కట్టుకట్టి దరఖాస్తులు చేసియుండలేదు. కసబు కాలంకూడా మించిపోయినది. నీలి ఆకు బాగావున్నది. యీసంవత్సరము ధర కలిగియున్నందున మొదటికోతలోనే ఆసామికి చాలా లాభం వచ్చినది, నీలితొట్లకుయెంతమాత్రం విరామములేకుండా పనిజరుగుతున్నది. రెండవ కోతకు సిద్ధముగానున్నది యీ ఆసాముల వలన సిస్తు వసూలు కావడమునకు యేమిన్ని అభ్యంతరము వుండదు. మెరకవూళ్ల ఆసాములకుడి మెండ్లుచేసి జప్తులు చేస్తేనే గాని దస్తు వసూలు అయ్యేటట్టు కనుపించదు. అయినను సుస్తిచేయక బేబాకుగా వసూలుచేస్తువున్నాను గనుక చిత్తానుకు విశదం నిమిత్తము మనవి వ్రాసుకున్నాము.

(c) యీ జమీను నా అనుభవప్రకారము పట్టా చేయించవలెనని అర్జి యిచ్చుకుని వుండగాగ్రామస్థులున్ను విచారణచేసిన తరువాత గేజటీకి వేయించి పట్టా చేస్తామని వుత్తరువు చేసిన ప్రకారము యిదివరకే పట్టాచేయవలసి యున్నట్టు కనపడు చున్నది.

### Translation.

To the Superintedent of Sea Customs. The petition presented by the undersigned inhabitants of—

We have been living in this town for a long time, carrying on trade and exporting the goods of this port to the coasting towns. In the face of the non-liability hitherto to duty on the goods imported

at this port, a duty of Rs. 0—0—2 per bag is being enforced under your direction as Port Improvement dues but it is needless to represent that the port has not been improved at all. No inconsiderable inconvenience is experienced by us at this port at the time of plying boats, and when the passengers go to the steamers or come from the steamers to the port. You have been transferred here recently, and you will come to know by and by of the difficulties existing at this port. Boats cannot reach steamers unless they travel at first for some distance through a canal, and then through the arm or inlet of the sea, and then traverse a bar at the place where they have to enter the sea and travel some miles. Moreover if it be low tide when the boats reach the bar, they get aground and have to lie there for some hours i. e., till the setting in of the high tide. Though it may not cause much inconvenience if the loaded boats get stranded there, it will entail great misery on passengers in pinnaces, which, unable to withstand the high tide of the sea, and being tossed about make the passengers giddy, and prone to vomit, drive them to their wit's end, and deprive some of their consciousness. It also sometimes happens that the steamers weigh anchor and sail away, without stopping, by the time the passengers reach them after suffering so many troubles. When this happens, passengers gain the shore half dead after suffering all these troubles. Moreover, as a high surf prevails at this port in certain seasons, neither the boats nor the pinnaces could reach the steamers. By reason of the steamers anchoring at a great distance owing to the shallowness of this port it takes a long time to export and import goods, and the plying boats now and then have to remain on the sea at night without returning to the shore; and the boatmen are given to committing thefts to a great extent from the boats in respect of all sorts of goods: these goods consist for the most part of oil seeds and other seeds. Even if the stolen goods are seized in the houses of boatmen, the Magistrate at the trial dismisses the cases for want of identification of the property: this causes the thieves more to think slightly of us. The Government has not taken into consideration all these inconveniences and there is no protection whatever at this port. The export and import at this port seem to be for the gain of the boatmen, and not for the benefit of the merchants, and some engineers have come here some time back, inspected both the bar

and the circuitous route to the steamer, and observed that the velocity of the current would make the bar, if cut, become shallow again and that it would therefore be useless to do so, that if the present landing place (wharf) be abandoned and the bathing ghat converted into a wharf, it would avert the thefts and inconveniences and the steamer also will be close to it, but nothing substantial transpired.

We thought that these inconveniences and losses may be averted by the introduction of a railway, but the Government is hesitating to accord sanction though the Southern Mahratta Company is prepared to construct a railway. If the Government on political considerations, since this is a seaport, were to contemplate a broad gauge to communicate with the East Coast Line rather than give it to Southern Mahratta Co., which is of narrow gauge, it does not appear that the Government would construct the line so soon owing to its present financial exigencies. If therefore the Government on the score of the welfare of the people accord sanction to the Southern Mahratta Company at least, it will be conferring a great benefit. The introduction of a railway here will not only be a source of welfare to the people of these parts but the Government will virtually become the saviours of the population of a famine-stricken tract by securing abundance of grain from the villages in these parts at the occurrence of a famine. We therefore respectfully pray that you will take these into your consideration and cause proper measures to be adopted.

(*b*) In obedience to your orders dated the 6th instant observing among other things that no reply has been received as yet to the order issued by you last month directing me to report on the state of the crops &c., of the Taluq this year, I beg to represent as follows:—

Owing to the failure of the timely rains, the crops are young in the villages in drier parts; in spite of endeavours to plough the land, the soil became hardened and the plough share could not sufficiently sink into the ground and furrows could not be made out. The gingelly or seasamum, black species of pulse, castor oil seeds have become blighted. The wild melon has for the most part been damaged. The first crop is thriving. In the matter of the cultivation of the

immemorially wet lands and those brought under wet as water was available in time in the irrigation channels, seedbeds were prepared, the seedlings have matured and been transplanted. The crops on lands sown broadcast are fair. The dispute between the beneficiaries and the zemindar in respect of the rent fluctuating with the produce remained unsettled; they have not applied for water to cultivate those lands in some of the zemin villages. Some lands cultivated in the last fasli have been sub-merged in the current fasli in the waterspread of the Colair and have been left waste. The applications for the immemorial waste lands in Chinnivada made this year by some temporary tenants, were submitted for approval to the higher authorities; as orders have not been received thereon, those lands were not cultivated. The abkari contractors have entered into a combination among them in the matter of the tree-tax on palmyras, and have not applied therefor. The toddy-drawing season has also expired. The indigo plant is flourishing. As there is a good market for it this year, the ryot has derived a good profit in the first cutting alone. The indigo vats are being worked incessantly. The second cutting is awaited. There will be no difficulty in realising the kist from these ryots. There is no prospect of the collections being made from the ryots of the highland villages unless demand notices are issued and distraints made. However, I am making the collections without (leaving) balances and without slackness. I have therefore brought (these facts) to your notice.

(c) I applied to have the puttah issued in my name for the said land on the strength of my past enjoyment thereof, and an order was passed that the puttah will be issued after enquiring the villagers and the publication is made in the (District) Gazette. It would therefore appear that a puttah ought to have been issued ere this (date).

## 1896.

(a) మహారాజరాజశ్రీ చిత్తూరుజిల్లా పలమనేరుతాలూకా తహశ్శీల్ దారు వారి సముఖమునకు:—చెర్వ్యపల్లె గ్రామం కాపురస్తుడు చెన్నారెడ్డి వ్రాసుకొన్న మనవి. మంజుకూరుగ్రామములో నేను సరాసరికి ఇన్నూరు రూపాయల శిస్తు సర్కారుకు చెల్లించేవాడనై యున్నాను. నా అనుభవంలోవుండే మెట్ట మాగాణి ములుం తోటలు ఛక్కగా సత్తువచేసి సాగుబడి చేయబడుతూవున్నది. ఈసంవత్సర

మాగాణి భూమి వర్షప్రతికూలంవల్ల కొడవలి పూజ్యం అయినది నాలుగుచాళ్లదున్ని మానుతోలి చెత్తా చెదరు లేకుండా అచ్చుకట్టు తీసి కైవారంచెక్కి మంచి అనువన చల్లితిని. పైరున్ను పోదిగావచ్చింది. కలుపు కాండ్ర తీయించినాను నిండిపొట్టలలో వుండగా గాలివాన కొట్టినందున పొట్టలు పగిలి సుంకు మోపక పైరంతయు తాలైపోయెను. ఇదియేది విచారింపక రివిన్యూ ఇన్స్పెక్టరు గారును కరణమున్ను యీ మాగిలికి మామూలు శిస్తున్ను నా పేరట గట్టి యెంతచెప్పుకొన్నా వినక తుదకు నా గొడ్లును ఏలం వేయించ తలచి యున్నారు. మెట్ట పొలమైన పండితే దానితోట్టిదీనికి పెట్టవచ్చునంటే అంచులో వూరివెంబడి గుడ్డాలు రెండు తప్సకడమ చేల్ను తరాగింజపెట్టి కాలానికి జడివాన కురిసినందున కాటికపట్టి ఫలనష్టము సంభవించి నది ములుంతోటలో సజ్జకారున రొంపివానలుకురిసి అమునియ్యక వెనుక చిక్కిగున్నపోతే గడ్డి బలిసి పైరెక్కక చెడిపోయెను. ఎన్నెన్నో పాటుబడి కొంత పొగాకు మిరపకాయలు రెండుపుట్లురాగులు పండించుకొన్నందుకు అవి వాటిశిస్తుకే చాలిచాలకపోయినందున పిల్లకాయలు మేము సంకటికైన గానక యిజాగుపడుతూ వున్నాము. ఈ యేడు ఆముదాలు పురుగుపట్టి పాడైపోయెను ఉలవలు కంది అనరాదు కాబట్టి ఖావిందులుఖుద్దున దయచేసితనిఖీ చిత్తగించి మాగాణిశిస్తైనా తోసివేయునట్లు ఉత్తరవు దయచేయించ కోరుచున్నాను మరిన్ని కరణం ఫలపుష్కముల మొతరఫా పయికము ఇబ్బడిగా మావల్లవసూలు చేస్తున్నాడు అదిన్ని చిత్తానకు తేవలెను. నేను పిల్లమేక పదిమందికలవాడు. రివిన్యూ యిన్స్పెక్టరువారు చేసేఅన్యాయంవల్ల యిల్లువాకిలి విడిచి ముసపా పోవలసిన దశ వచ్చియున్నది. కనుక ఖావిందులు దివ్యచిత్తానికి తేవలెను.

(b) హెడ్ అసిస్టెంటు కలక్టరుదొరవారి సముఖానకు—ఈ గ్రామంలో నాకు హంసాయీగల జనరల్ క్లాసు నెంబరు సుమారు 663 యంగుల విస్తీర్ణముగల భూమికిన్ని 1690 ఫసలీలో యీఅర్జీదారుడు దరఖాస్తు చేసుకొనియున్నాడు. ఆదరఖాస్తుతాలూకా తహశ్శీలుదారుని వారివల్లతోసివేయబడ్డట్టు కరణంచెప్పినాడుగాని ఆతహశ్శీలుదారుని వారు ఆ మేరకు ఇండార్సు ఇచ్చివుండలేదు. సదరుగ్రామంలోనే వుండే అయ్యప్పనాయుడు పిమ్మట ఆభూములకు దరఖాస్తు చేసినట్లున్ను దరఖాస్తుసముఖములో దాఖలు కాబడి వున్నట్లున్ను అది యిప్పటికి యేవిధమైన తీర్మానమును చేయబడకవున్నట్లున్ను అర్జీదారుడువింటూన్నాడు. మరిన్ని వెనుకటి దరఖాస్తుదారులైన అయ్యప్పనాయుడు మొదటి దరకాస్తుమంజూరు చేయబడలే

దన్న విషయములో సందేహముగలిగి మొదటిదరఖాస్తు బేమంజూరు అయినవుత్తరువు నకలు తీసుకోవడంలో కరణం చెప్పినవర్తమానం అబద్ధమనిన్ని, అప్పటితహస్సీలుదారునివారు ఆదరఖాస్తు మంజూరుచేసినారనిన్ని, వెంటనే డివిజన్ ఆఫీసువారు పట్టాయివ్వగలందులకై తరందార్లు తీరువవేయడానికి పంపబడ్డారనిన్ని, వర్తమానంతెలియనాయెను. కాబట్టి యీ అర్జీదారుకు యిచ్చుకొన్నముందు ధరఖాస్తు హక్కునుబట్టి ఆ భూమిని యీ అర్జీదారునికే అనుభవమునకును వచ్చులాగున ఉత్తరువుదయచేయగలందులకై ఖామందులు వేడుకోబడుచున్నారు. ఇందుతోడన్న 1690 ఫసలి తాలూకు తకరారు బుక్కులో నమూదు అయివుండే డివిజనల్ ఆఫీసువారు చేసినవుత్తరువునకలును దాఖల్ చేసుకోబడియున్నది.

(*c*) చి రామన్నకు ఆశీర్వాదములు. నీవు నెలదినములలో వస్తానని చెప్పి వూరికిపోయి ఇంతవట్టుకు మూడునెలలయిన్ని వచ్చినావు కావు. కారణమున్ను తెలియలేదు. యిక్కడ నేను పడేశ్రమను చెప్పితీరదు. ఇంట్లో పెద్దమ్మవారు చిన్నమ్మవారు పోసినది.

## Translation.

(*a*) To the Tahsildar of Palmaner Taluq, Chittore District.
The petition of Chenna Reddi, inhabitant of Cheruvupalle village.

In the aforesaid village I am liable to pay, on an average, an annual revenue of Rs. 200. The dry, wet and garden lands in my enjoyment are being amply fertilised and cultivated. During the current year owing to the failure of rains, the wet fields have dried up and there was no harvest. After ploughing four times, the fields were levelled, I raised the ridges and removed dried leaves and dirt, raised and thinned the bund and sowed it in season. The corn too grew luxuriantly. I caused the crop to be weeded. When the tender ears (of corn) were maturing, a hurricane blew and the ears became chaff not able to bear the corn blossoms. Without considering these facts, the Revenue Inspector and the kurnam charged me with the usual assessment thereon and without listening to my solicitations are bent upon selling my cattle in auction. Had the dry lands at least yielded it might have been used for paying the kist on the wet lands; but when the corn was forming in the ears, all the plots excepting two bordering on the village site, became subject to mildew on account of torrents of rain, and resul-

ted in failure of crop. In regard to the wet cultivation on the stubble field, the falling of the rains averted seasonable work. The corn dwindled, and when attempted to be ploughed (to be weeded) the stunted grass obstructed the growth of the corn. In spite of utmost exertion, a quantity of tobacco, chillies and two putties of raggi was secured, but these are barely sufficient for the revenue on the plots, and we and our children are in despair even for the coarse raggi pudding. The castor plants were affected with worm in the current year, not to speak of gram and red gram. I therefore request that you will kindly make a personal inspection and order the remission at least of the assessment on the wet lands. Moreover, the kurnam is levying the tax on the fruit trees at double the rate. That must also be noted. We (I and my children) are ten souls. Owing to the injustice perpetrated by the Revenue Inspector, time has come when I must go away abandoning my house, &c (properties). The authorities have therefore to consider these.

(*b*) To the Head Assistant Collector.

The petitioner applied in fasli 1690 for the assignment of about 663 inches of land adjoining the village. The kurnam stated that the application was rejected by the Tahsildar, but an endorsement to that effect has not been received. The petitioner hears that Ayyappa Naidu of the same village has subsequently applied for those lands that the application has been filed in your office, and that it has not yet been disposed of. It has been ascertained from the copy obtained by the later applicant Ayyappa Naidu who doubted the kurnam's information in respect of the rejection of the original durkhast application that the kurnam's version was false, that the then Tahsildar had assigned the land and with a view to issue a puttah the classifier has been sent for soon afterwards by the Divisional officer to fix the assessment thereon. The authorities are therefore prayed that the said land may be ordered to be assigned only to the petitioner (for enjoyment) by reason of the priority of his application. The copy of the order passed by the Divisional officer in the register of objections referring to fasli 1690 has been filed herewith.

(*c*) Blessings to C. Ramanna. You left for the village promising to return within a month, but you have not returned yet, thought it

is now three months (since you left.) I could not describe the difficulties I am undergoing here. All the youngsters in the family are affected with small pox.

## 1890.

(a) దేన్నిగురించి యేర్పాటు చెయ్యడము యుక్తముగా వున్నట్టు కనబడు
తున్నదో అట్టి గవర్నమెంటు పత్రములతో చేరిన కొన్ని విషయములను గురించి
నిబంధన కలగచెయ్యడమే యీ బిల్లుయొక్క వుద్దేశముగా వున్నది.

ఇంగ్లీషు చట్ట ప్రకారము వుమ్మిడిగా వాగ్దత్తము చేయబడ్డ ఆయామనుష్యు
లలో లేక ఋణప్రదాతలలో ఒకడు చనిపోయినమీదట కరారు విషయమై వ్యాజ్య
ము తేవడమునకు గల హక్కు చనిపోగా మిగిలిన వారికిన్ని కడపట చెప్పిన యిద్దరు
లేక యెక్కువమంది మిగిలినవారు చనిపోయినమీదట అతని స్వకీయ ప్రతినిధి
కిన్ని చెందుతున్నది. చనిపోగా మిగిలివున్న యీ హక్కును పట్టి పైకము పుచ్చు
కొనే మనిషి చనిపోయినవాని ప్రతినిధికి అందుకుగాను ఉత్తరవాదిగా వుండవచ్చు
ను. కరారు శాసనముయొక్క 45దో సెక్షను ప్రకారము ఇండియాదేశమందు యీ
పద్ధతి మారి వున్నది అందులో నిర్ణయించే దేమనగా—వొక మనిషి యిద్దరికిగాని
యెక్కువ మందికిగాని సమిష్టిగా వాగ్దత్తము చేసివున్నప్పుడు కరారువల్ల తద్విరోధ
మైన తాత్పర్యము కనపడితేనే తప్ప లేనియెడల అతనివిషయములలోనున్ను
వారివిషయములలోనున్ను దాన్ని నెరవేర్చడమును గురించి దావాచేసే హక్కువా
రందరు బ్రతికియుండగా వారియందున్ను వారిలో ఎవరయిన చనిపోయిన తర్వాత
బ్రతికి వుండువొకడు లేక యెక్కువ మందితో సమిష్టిగా అట్టి చనిపోయినమనిషి
యొక్క ప్రతినిధియందున్ను, యింకా బ్రతికివుండేవాడున్ను చనిపోయిన
తర్వాత సమిష్టిగా అందరి ప్రతినిధులయందున్ను వుంటున్నది. ఈ సెక్షను విష
యమై యీ శాసనముయొక్క మసోదాను తయారుచేసిన లా కమీషనర్లు చెప్పిన
దేమంటే:— "హక్కులున్ను జవాబుదారీలున్ను యెవరికి చేరుతున్నదో దాన్ని
క్రమపరచడమందు అర్హులైవున్న వారిలో లేక హక్కుగలవారిలో వొకడు మృతి
బొందిన తరువాత వుమ్మడిజవాబుదారీలున్ను హక్కులున్ను ఈక్విటీలాను
ఇంగ్లీషు కోర్టులయొక్క నేమి ఇండియాదేశపుసివిల్ ప్రొసిడ్యూర్ కోడుయొక్క
నేమి పద్ధతి ప్రకారము అతని ప్రతినిధికిని చనిపోగా మిగిలినవానికిని వుమ్మడిగా
నున్ను ఆ మిగిలినవాడు మృతిబొందిన తర్వాత వుభయ ప్రతినిధులకున్ను వుమ్మడి
గానున్ను చెందవలసినదని చెప్పుతున్నాము. మాకు తెలియవచ్చినంతమట్టుకు ఇండి

యీ దేశమందు నిరాక్షేపముగా యీ మాట అంగీకరించడమైనది " కరారు శాసనము జారికావడమునకు పూర్వమున్ను జారిఅయిన తరువాతనున్ను గవర్నమెంటు ప్రామిసెరినోట్ల విషయమై వ్యాజ్యము తెచ్చి వాటికిగాను చెల్లించవలసిన పయికము మొత్తములను రశీదులు యిచ్చే హక్కు వాటిని వుమ్మడిగావుంచుకొన్న ఇద్దరులేక యెక్కువమంది చనిపోగా మిగిలినవానికి లేక మిగిలినవారికి చెందుతున్నదని ఇండియన్ పబ్లిక్ డెట్ ఆఫీసువారు వాడుకగా యెంచినట్టు కనబడుతున్నది. అయితే గవర్నమెంటు యిలాఖాల ఆఫీసర్లు ఖరారు శాసనముయొక్క 45వో సెక్షనుమందు దృష్టివుంచి అట్టి వాడుక ప్రకారం జరిగించడము క్షేమకరముగాదని యిటీవల అభిప్రాయము తెలియచేసి వున్నారు.

(b) పల్లెటూరిలోవుండే హిందువులున్ను మహమ్మదీయులున్ను యింకా యితరమైనవారున్ను మరణశాసనము వ్రాయకుండా చనిపోయి వారి ఆస్తికి వారసుదార్లు ఎవరు లేకుండా పోయినప్పుడు అట్టి వారియొక్క చరాస్తి సంబంధమయిన దావాను పయిసలు చేయడములో జరిగించబడవలసినచరియ 1802 వ సం॥రం 5డో రెగ్యులేషన్ 16సెక్షన్ 7డో క్లాసులో చెప్పబడియున్నది. డిస్ట్రిక్టు మేజస్ట్రీటువారు యిటువంటి విషయములను డిస్ట్రిక్టు జడ్జీగారికి రిపోర్టుచేసి తరువాత కలెక్టరుగారికి ఆసంగతిని తెలియచేయవలసినది ఆ ఆస్తికిగాను డిస్ట్రిక్టు కోర్టువారియెదట దరిమిలాను యెవరయిన తమకు హక్కు కలదని దావాచేసినయెడల అట్టిదావా సరియైన కారణములేకనే తేబడ్డట్టుతలచడమునకు హేతువులు ఏమైనా వున్నయెడల అట్టిదావా జరుగుకాలములో గవర్నమెంటు వారికిగల బాధ్యతను కోర్టువారికి తెలియచేయడమునకున్ను ఆదావా జరిగినప్పుడు గవర్నమెంటువారికినష్టమురాకుండా కనిపెట్టి ఉండుటకై తగిన యేర్పాటును కలెక్టరుగారు చేయవలసినది ఇండియా దేశపు పారంపర్యాస్తి బాధ్యతనుగురించిన చట్టముయొక్క నిబంధనలకు లోబడిన యూరోపియన్ బ్రిటిష్ దేశస్థులయొక్క ఆస్తి వారి మరణానంతరము అడ్మినిస్ట్రేటర్ జనరల్ గారి స్వాధీనములోకి తీసుకో బడును. మదరాసు షహరులో మరణశాసనము వ్రాయకుండా చనిపోయ్యే మనుష్యులయొక్క చరాస్తి 200 రూపాయల ఖరీదుకంటె ఎక్కువగాకుండా వున్నప్పుడు దాన్ని పోలీసువారు స్వాధీనముచేసుకొని పోలీసు కమిషనరుగారి వుత్తరవు మేరకు 1867 సంవత్సరపు 8 వ నెంబరు పోలీసుశాసనముయొక్క 76-77 సెక్షనుల ప్రకారము యెవరయితే తమ హక్కును స్థాపిస్తురో వారికి అదియిచ్చి వేయబడును.

## Translation.

(*a*)—The object of this bill is to provide for certain matters relating to Government securities which it appears expedient to regulate in law.

Under the English law, the right to sue in respect of a contract in the matter of a promise made jointly by two or more persons or creditors rests with the survivor or survivors after the death of any of them, and with his legal representative after the death of the survivor or survivors. The surviving promisee may hold himself responsible to the representative of the deceased promisee. But under sec. 45 of the Indian Contract Act the procedure has been modified in India. It is provided therein "when a person has made a promise to two or more persons jointly, then, unless a contrary intention appears from the contract, the right to claim performance rests, as between him and them, with them during their joint lives, and, after the death of any of them, with the representative of such deceased person jointly with the survivor or survivors, and, after the death of the last survivor, with the representatives of all jointly." The law commissioners who drafted the section observed of it "In regulating the rights and obligations attaching to those entitled or having claim to them, the obligations and rights will rest jointly, whether according to the Courts of equity in England or under the Civil Procedure in India, after the death of any of them, with the representative of such deceased person jointly with the survivors, and after the death of the survivors with the representatives of both jointly." This idea has, as far as we are aware, been recognized in India. Both prior to the operation of the Contract Act and subsequently, it appears that the Public Debt office has uniformly considered that in the cases of amounts payable in respect of claims for Government Promissory Notes, the right to pass receipts therefor rests after the death of two or more holders thereof with the survivor or survivors jointly, if either or any of them dies. But the Government officers have not lost sight of the principle embodied in Sec. 45 of the Contract Act, and expressed latterly that it would not do well to adopt it.

(*b*) Clause 7 of section 16 of Regulation III of 1802 regulates the disposal of suits in respect of unclaimed personal property left by Hindus, Mahomedans and others who have died intestate and

without heirs. The District Magistrate shall report such matters to the District Judge and inform the Collector of his having done so. If claims to the property are subsequently advanced, the Collector should arrange for the case being watched and the interests of Government being represented in the Court and any loss to the state averted if there is reason to believe that the claims are unfounded. Property left by European British subjects to whom the provisions of the Indian Succession Act apply is taken charge of by the Administrator-General. In the town of Madras, the moveable property of persons dying intestate if of value not exceeding Rs. 200, is taken charge of by the Police and delivered, under the order of the Commissioner of Police in pursuance of secs. 76-77 of the Police Act, to the persons who establish their claims.

## 1906.

కమిటీవారి రిపోర్టును పూర్ణముగాగాని దానిలోని ముఖ్యాంశములనుగాని నేను అంగీకరింపజాలనందుకు చింతించుచున్నాను. ఆలోచన సభలోనికి తెచ్చినట్లుగానున్న బిల్లులోగల మూలసిద్ధాంతములు నామనస్సునకు విరుద్ధముగానున్నవి. కమిటీవారిలో అనేకులు ఆసిద్ధాంతముల ననుసరించి యేర్పరుపబడిన నిబంధనలను ఏమిచేయక అట్టే వదలివేసి సదరు సిద్ధాంతములను సామాన్యముగా అంగీకరించినదేగాక కొన్ని సంగతులలో వాని వుపయోగమును ఇంకను వ్యాపింపజేసిరి.

బిల్లునందలి సిద్ధాంతవిషయములోను నిబంధనల విషయములోను సామాన్యముగా నాకుగల అభిప్రాయముల విషయమున ఘనతవహించిన నాతోడి సభ్యుల ఆదరణ నాకులేదను విషయము నేనుమరవలేను. దీనికి సమాధానము వైప్రాయిగారు ఈమధ్య అయోధ్యలోని తాలూకుదార్ల విజ్ఞాపన పత్రికకు బదులుచెప్పినపుడు సెలవిచ్చిన మాటలవలన తెలియనగును. వారు తమ అభిప్రాయములను తెలుపునపుడు చెప్పినదేమనగా—నేనును భూస్వామిగానుండుటను బట్టి మీ మీద మోపియున్న అనేకములయిన జవాబు దారీల లక్షణమును ఎరిగినందున మీయందు నాకు పూర్ణానుతాపము కలదు. భూస్థితుల నిర్వాహముతో ఏమిసంబంధములేనివారు భూస్వామ్యమునకు అనుబంధమయి యేర్పడియుండుజవాబుదారీలను నెరవేర్చు కష్టము ఇట్టిదని తెలిసికొనుటకు ప్రాయికముగా అసమర్థులుగా నున్నారుకాని ఆకష్టములేవియున్నను భూస్వామికిని పాయకారీ రయితునకు తాలూకాదారునకును, ఉండవలసిన స్నేహభావమువలనను, వారిలో నొకరికి అనుకూలమయి

నది మరియొకరికిగూడ అనుకూలమయినదనియు ఒండొరుల సాహాయ్యము చేతనే సామాన్యాభివృద్ధి గలుగగలదనియు తెలిసియుండుటవలనను ప్రతిదేశమందును కార్యసాధనమగునని నేను నమ్ముచున్నాను."

వైస్రాయిగారు తెలిపినటువంటి మహాభిప్రాయ ప్రకారము భూస్వామి యొక్క ప్రతిస్వాతంత్ర్యమును లేక హక్కును రయితునకు భారముగాగాని లేక హానిగాగాని ఉండక వానికి ప్రత్యక్షముగాగాని గూఢముగాగాని లాభకరముగానుండు ననెడి విషయము ఇప్పుడు గ్రహింపబడియున్న దానికంటె మరింత చక్కగా గ్రహింపబడియుండిన మేలుగానుండును. ఇదిగాక ప్రజలలో ముఖ్యమయిన హక్కులను పూచీలను ప్రథమతః నిర్ణయించుటకయి సర్కారువారు చట్టమేర్పరుచుటకు పూనుకొనునట్టి ప్రస్తుతపు సంగతివంటి సంగతిలోనయినను నిజస్థితులను లాభా లాభముల పారంపర్యాభివృద్ధిని తగినంతమట్టుకు యోచించి చూడకయే భావగర్భితమయిన అభిమానములును కారణసహితతర్కములును తెలుపుటవలన చాలమట్టుకు అనేకమందికి అభిప్రాయము అటువంటిదిగానే ఏర్పడవచ్చునని నేనుచెప్పగలను. ప్రస్తుతపు సంగతిలోని స్థితి యేమాత్రము కష్టమయినది కాకపోలేదు. ఏలయనగా ఈభూసంబంధమయిన చట్టము వరుసగా అనేక గవర్నర్ల హయాములలో సర్కారువారిచే యోచింపబడుచుండినదే గాక వారు ఎవరికి అభిప్రాయార్థము పంపిరో అట్టి ప్రముఖులును యోచించుచుండిరి. దానివిషయమయి జరిగిన చర్చయంతయు లార్డు ఆంతిల్ గారు యుక్తముగా చెప్పినట్లుగానే, "తీర్పుకాకుండ భేదాభిప్రాయములతోనిండి కలవరపెట్టదగిన రెకార్డు"గానున్నది అట్లున్నను కమిటిలోని తక్కినవారి అభిప్రాయముతో పొందక సాహసించి భేదపడుటలో నా అభిప్రాయములు ఈరాష్ట్రముయొక్క భూమిషరతులను గురించి ఇప్పటివరకును మిక్కిలి ప్రామాణికులగువారు చెప్పిన అభిప్రాయములతో పొందికబడియున్నవను సంగతిమాత్రము నన్ను ఓదార్చుచున్నది.

మొదటినుండి ప్రస్తుతపు బిల్లును గురించి చెప్పబడిన ఉద్దేశము ఏమనగా తత్కాలమందుండెడిహక్కులను నిర్ణయించుటయేగాని క్రొత్తవానిని కల్పించుట కాదు అని చెప్పబడ్డది. ఉద్దేశములయు కారణములయు వివరణములో "జమీందారీ రయితుయొక్క హోదా ఈరాజధానిలో ఎప్పుడునుబొత్తిగా క్షీణించిపోలేదు" అనియు "హైకోర్టువారు ఇటీవలచేసిన తీర్పులచేతనే ఖాయపరుపబడియున్నది" అనియు చెప్పబడియున్నది. మరియు లార్డు ఆంతిల్ గారు ఆ తీర్పులను "చట్టముగా

మార్చి దృఢపరచుటయే" బిల్లుయొక్క ఉద్దేశమని చెప్పిరి. బిల్లులో "క్రొత్తవయిన ట్టిగాని ముందున్నవానిని బొత్తిగామార్చి వేయునట్టిగాని" మార్పులు చేయకుండ ముందు ఉన్నట్టి హక్కులను నిర్ణయించెడి యుద్దేశమును చెప్పిన ప్రకారము నెర వేర్చియుండినట్లయినను లేక సిలెక్టు కమిటీవారు బిల్లువిషయమయి నిర్దేశింపబడిన యుద్దేశమునుండి తొలగిపోవక దానినే అనుసరించియుండునట్లు అయినను ఈ రిపోర్టును నిరాక్షేపముగా అనుమోదించుటకునాకు లేశమయినను అనుమానము ఉండియుండదు. కాని, ఇక ముందు చూపపోవునట్లు వాడుకనుబట్టియేర్పడిగాని న్యాయస్థలములద్వారా నిర్ణయింపబడిగాని ఉన్నట్టి హక్కులను సంరక్షించుటకు యత్నించను లేదు. తత్కాల స్థితులను హానికరములుగా నుండెడి గొప్పమార్పులు చేయకుండమానను లేదు. కాబట్టి నేను భిన్నాభిప్రాయుడయి యున్నానని వినయ పూర్వకముగా తెలుపవలసియున్నది.

"సాగుబడికాదగిన బొత్తు భూమి" అనుమాటను చెరువు గర్భములు, సము దాయపు భూములు నవుకరి షరతు భూములు తప్ప భూస్వామి ఖానిగీ భూమికానట్టి యితర భూమి అంతయు అని నిరచించి, సాగుబడి కాదగిన బొత్తుభూమిని ఇప్పు డుంచుకొని యున్నట్టి లేక యికమీద ఉంచుకొనుటకు అంగీకరింపబడునట్టి ప్రతి రయితును తన ఆధీనభూమిలో ఖాయమయిన అనుభవపు హక్కుగలిగియుండునని బిల్లు సర్వసాధారణముగా నిబంధించుచున్నది. పశువులను మేపుటకుగాను కరారుచే సికొని యిచ్చిన బంజరు భూములవిషయములో వాస్తవముగా అడవికిగానే భూస్వా ములు ఉంచుకొని వ్యవసాయసంబంధమయిన పయిరులను తాత్కాలికముగా పెట్టు కొనుటకు కరారుచేసియిచ్చిన భూముల విషయములో భూస్వామి తాను సాగుబ డికి తెచ్చిన తేదినుండి యిరువది సంవత్సరములవరకు అట్లు తెచ్చినభూముల విషయము లలోను కొద్ది మినహాయింపులు చేసియున్నవి. ఇదిగాక అనుభవపు హక్కు వంశ పారంపర్యగా రాదగినదనియు రయితు ట్రాన్స్ఫరు చేయదగినదనియు ప్రకటితమ యినది.

ఇదియే బిల్లుయొక్క ఏర్పాటు (స్కీము) కంతయు ఆధారమయినట్టియు రయితుకోసము నిబంధించిన స్వాతంత్ర్యములలో అనేకములకు ఆధారమయినట్టియు ముఖ్యమయిన హక్కుఅని సర్వత్ర ఒప్పుకొనవలసినదిగదా? పయిరీతిగా చెప్ప బడిన హక్కునకు ఎవనికయిన తోచెడి మొదటి ఆక్షేపణ యేదనగా ప్రస్తుతమందుండు శాసనరూపమయినట్టియు న్యాయాధికారులు చేసినట్టియు

చట్టముయొక్క ఆధారముతో చేయబడి ప్రస్తుతమందుండెడి కరారులను కొట్టివే యునట్లుగా పయిని దృఢముగా చెప్పినముఖ్యమయిన హక్కు జరిగిపోయిన కాల మునకును ప్రయోగపడునట్లు సదరు క్లాజు చేయుచున్నది. సర్వసామాన్యము గాను ఖాయముగాను ఉండునట్లు ఉద్దేశింపబడిన అనుభవపు హక్కు ఏ మాత్రమయినను నిలుపదగినదేయని తీర్మానింపబడినయెడల సదరు నిబంధనయయి నట్టి బిల్లుచట్టమగు తేదినుండిమాత్రము అమలులోనికి వచ్చునట్లు చేయవలయును. ఆ నిబంధనయొక్క యోగ్యతల విషయమై యోచించునపుడు సదరు హక్కును అట్లు సర్వసామాన్యమని నిర్ధారణ చేయుటకు సాధకముగాని ఆధారముగాని యేమి యులేదని నేను వినయపూర్వకముగా తెలుపవలసియే యున్నది.

పైని చెప్పిన అధికారులు ఉద్దేశించిన హక్కును ఒప్పుకోక నిరాకరించుచు వారిచ్చిన యేకాభిప్రాయమునకు కారణము ఏమనగా ఈ దేశములో రెండు వేర్వేరు విధములుగా ఏర్పడినరయితులు ఆధీనపు రయితులు—అనాధీనపు రయితులు—అని అన్నిచోట్లను వున్నారని వారు స్పష్టముగాఎంచివుండిరి. 1861 వ సంవత్సరములో, యిండియా గవర్నమెంటువారు పాయకారి రయితు హోదావు బదులుగా భూము లయొక్క తరగతుల యేర్పాటును అనుభవపు హక్కుయొక్క అంగీకారమునకయి ఆధారముగా తీసుకొనుటకును ప్రస్తుతపు బిల్లులోని సాగుబడికాదగిన పొత్తుభూ మికి ఈడుగానున్న "రయితి" భూమికి యాసత్తుకు కొద్ది మినహాయింపులతో ఆ హక్కును చేర్చుటకు ఉద్దేశించినపుడు స్టేటు సెక్రిటేరిగారు ఇండియా గవర్నమెం టువారికి యిట్లు వ్రాసిరి—"మొట్టమొదట మీ యుద్దేశము బెంగాలులోనే కాదు ఇండియాలో అనేక భాగములలోనుండు ప్రజల భావములలోను పాదుకొనియుం డెడి భేదమును, అనగా, కాపురమున్నట్టి లేక నిలుకడగానున్నట్టి వ్యవసాయదా రునికిని కాపురమున్నట్టి లేక నిలుకడలేనట్టి వ్యవసాయదారునికి గల భేదమును కొట్టివేయుచున్నది. రయితులకువారి పూర్వీకపు స్థితిని హక్కులను తిరుగ యిచ్చు టయే మీ దృఢమయిన ఉద్దేశముగా నుండునపుడు ఇది విపరీతముగాను అనపేక్షి తముగాను ఉన్నదని నాకు తోచుచున్నది"

మదరాసు గవర్నమెంటువారు పైనచెప్పిన ఆర్డరులో ("బిల్ కమిటీ"యను కమి టీవారు తయారుచేసిన ముసోదా ఎస్టేట్సు బిల్లుమీది రెవిన్యూ బోర్డువారి రిపోర్టును విమర్శించుచు) స్టేటు సెక్రిటరిగారియొక్క పయిన చెప్పిన యభిప్రాయమును పూర్తిగా అవలంబించి, "స్వాముదారుని, ఖానిగీ భూములుకానట్టి యితర

భూముల విషయములో, అనుభవముగల పాయకారీ రయితులకును. అనుభవములేని పాయకారీ రయితులకు గల భేదమును కొట్టివేయునట్టి బోర్డువారిచే సిఫారసు చేయబడిన స్కీము భూస్వామి విషయములో అధర్మముగాను అనుచితముగాను ఉండుననియు పాయకారీ రయితరికములను ఒక్క అనుభవపుపాయకారీయొక్క హక్కులో ఇమిడ్చి వారివిషయములో భూస్వాములను కేవలము పన్నుపుచ్చుకొనువారినిగాచేసి అందువల్ల వారు భూస్వాములుగానుండుటవలన కలిగెడి వుపయోగమును తగ్గించు'' ననియు ఎంచిరి. అయినను ఎస్టేట్లలోని వాడుకరీతిగా అనుభవములేని రయితులతో వాటి అనుభవముగల రయితులును ఉన్నారనుటను అంగీకరించి, గవర్నమెంటువారు ప్రతి పాయకారీ రయితరికమునకు అనుభవపు హక్కు చేరి యుండునని కోర్టువారు ఊహించవలయుననునట్టియు భూస్వామి అదిలేదని ప్రతివిషయములోను అట్లు లేదనుటకు రుజువుచేయుభారము భూస్వామిదిగాచేయవలయుననునట్టియు కమిటీయొక్క స్కీమును అంగీకరించి యీ ప్రకారము చెప్పిరి.

Translation.

I regret I am unable to assent to the Committee's report either wholly or materially. The fundamental principles of the Bill as introduced into the Council were opposed to my convictions and the majority of the Committee have generally ratified those principles by leaving the provisions based on them undisturbed in effect and have in some cases even extended their operation further.

I am not oblivious of the fact that in my general attitude towards the principles and provisions of the Bill, I have not the support of my Honourable colleagues. The explanation for this might be found in what fell from His Excellency the Viceroy the other day in his reply to the address of the Talukdars of Oudh. His Excellency said in the course of his observations: "as a landowner myself, I could fully sympathise with you in the many responsibilities thrown upon you. People unconnected with the management of landed estates appear to be often incapable of understanding the difficulty of fulfilling the responsibilities which the ownership of land always carries with it; but whatever the difficulties may be, I am sure that in every country the secret of success lies in the friendly relations which ought to exist between landlord and tenant, between ryot and talukdar, in the recognition that what is good for one is good for the other and that mutual assistance can alone ensure general prosperity". . . . . . . . . .

In the light of the striking sentiment expressed by the Viceroy, I should wish it had been realised more than it is that every privilege or right of the landholder does not necessarily connote a burden or detrimint to the ryot, but has its counterpart in an apparent or veiled benefit to him. I might further observe that in a case like the present where the State undertakes legislation to declare for the first time substantive rights and obligations between two important sections of the community, sentimental predilections and apriori reasonings without adequate regard to existing facts or historic development of interests can quite conceivably play a great part in shaping the convictions of many. And the situation in the present instance has been by no means free from difficulty seeing that this said legislation has been engaging the attention of successive Governments and exercising the judgment of eminent men consulted by them, and the tenor of the whole discussion has been, as aptly described by Lord Ampthill, "a perplexing record of indecision and disagreement." Neverthless, in venturing to disagree with the rest of the Committee, I am reassured by the fact that my views are in agreement with the eminently authoritative pronouncements up to date on the land tenures of the province.

The avowed intention of the present Bill was from the beginning to declare existing rights and not to create new ones. The Statement of Objects and Reasons says that "the status of the Zamindari ryot has never been lost in this Presidency" and "has been confirmed by the most recent decisions of the High Court"; and His Excellency Lord Ampthill said that the intention of the Bill was "to putrify into law" those decisions. If either the Bill had, in my humble opinion, kept to its avowed intention of declaring existing rights without introducing "new or revolutionary" changes, or only endeavoured to putrify judicial decisions, or if the Select Committee had kept the Bill to its declared object without deviation, I should not have had the least hesitation to accord to the present report my unreserved acquiescence. But unfortunately, as I shall endeavour to show, neither existing rights sanctioned by custom or judicially declared have been sought to be preserved nor grave changes subversive of existing conditions have been refrained from. I have therefore to record a respectful dissent.

Having defined "public cultivable land," to be all land other than landholder's private lands with the exception of tank-beds, communal lands and service-tenure lands, the Bill lays down universally that every ryot now in possession or who shall hereafter be admitted to possession of public cultivable land shall have a permanent right of occupancy in his holding. There are some exceptions made of waste lands let on contract for pasturage for cattle, lands reserved bonafide hy land holders for forest let under a contract for temporary cultivation of agricultural crops and lands reclaimed by landholder for a period of twenty years from the date of reclamation. It is further declared that the right of occupancy is to be heritable and transferable by the ryot.

It must be admitted on all hands that this is the fundamental right on which the whole scheme of the Bill is based and on which most of the privileges enacted for the ryot are made to depend. The first objection that occurs to one to the right declared as above is that the clause gives the asserted substantive right a retrospective effect so as to abrogate existing contracts based on the existing statutory and judge-made law. If the proposed universal and permanent right of occupancy is decided to be tenable at all, the provision should be made to take effect only from the date of the Bill being passed into law. Turning to the merits of the provision itself, I must submit there is no warrant or foundation whatever for such universal declaration of the right. The reason for the consensus of opinion among the authorities named above in refusing recognition for the proposed right is that they distinctly held that there were everywhere in the country two well-marked classes of ryots, viz, occupancy ryots and non-occupancy ryots. When in the year 1881 the Goverment of India proposed to take a classification of lands instead of the status of the tenant as the basis on which the recognition of occupancy right should be effected and to attach that right with a few trifling exceptions to all "ryoti" land which correspond to the "public cultivable land" of the present Bill, the Secretary of State wrote to the Government of India "your proposal in the first place annuls the distinction deeply rooted in the feelings and customs of the people, not only in Bengal but in most parts of India, between the resident or permanent, and the non-resident or temporary, cultivator. This, when your avowed intention

is to restore to the ryots their original position and rights, appears to me anomalous and undesirable."

The Madras Government in the order aforesaid (reviewing the report of the Board of Revenue on the draft Tenancy Bill framed by the Committee, designated "the Bill Committee") fully adopted the above view of the Secretary of State and held that the scheme recommended by the Board "which in respect of lands other than the proprietor's private lands, abolishes the distinction between occupancy and non-occupancy tenants, is both unfair to the landlord and inexpedient and would by squeezing all tenancies into the single mould of occupancy tenant right, convert the landlords into mere rent receivers in respect of them and thus narrow the scope of their usefulness as landlords." Recognising, however, that by custom obtaining in estates there were occupancy ryots side by side with non-occupancy ryots, the Goverment expressed their approval of the scheme of the committee that "Courts shall presume that occupancy right attaches to every tenancy and shall throw on the landlord the onus of proving its non-existence in every case in which he denies it.

## 1897.

మ-రా-రా-శ్రీ,

గోదావరి జిల్లా కలక్టరువారి సముఖమునకు, రామచంద్రపురం తాలూకా తహశీలుదారు వ్రాసుకొన్న అర్జీ.

(a) ఆన 1865 వ సంవత్సరం డిసంబరు 9 వ తేదిగల 486 నెంబరు తమ హుకుం ప్రకారం జమీందారియిలాకా వేగాయమ్మపేట గ్రామం తాలూకా మురుగు భూముల విషయమయి రివిన్యూఇన్‌స్పెక్టరు ద్వారా కొంతవిచారణ చేయించిన్ని, మురుగు కలిగిన భూములు నేను స్వయముగా చూచిన్ని ఆబాబతు గ్రంథం యిందుతో పంపించుకున్నాను దాఖలు చిత్తగించ కర్తలు.

సదరు మురుగు భూములకున్ను ఆజుబాజునవుండే భూములకున్ను స్న 1255 ఫసలీ లగాయతు హాలు సాలువరకు పంపులవారి అమర్కం లెఖలున్నూ తీసుకొని రావలసినదని వేగాయమ్మపేట కరణములను యెన్ని విధముల తెలియచేసి నప్పటికి లెఖలు లేవని కరణాలు చెప్పినారు. ఆ హేతువుచేత సాగుబడి గయాళువివరం తెలిసే సమజాయిషీ లెఖలు తయారుచేసి పంపించడమునకు వీలుకాలేదు. కొన్ని యీనా

ములకు కవులు కదపాలు జరిగినట్టు కనబడి అందుల అసల్లుచూచి నకళ్లు రికార్డుతో జతపర్చడ మయినది.

మురుగు కలిగిన భూములు:—

| బాబతులు. | | ప్రథమతః మురుగు కలిగినవి. | | దరిమిలాను శేద్యంలో వచ్చినవి | | గాకమురుగుకింద వున్నవి. | |
|---|---|---|---|---|---|---|---|
| | | య. | శిస్తు. | య. | శిస్తు. | య. | శిస్తు. |
| జిరాయితి | ... | 65-87 | 397-7 | 21-75 | 123-11 | 44-10 | 253-12 |
| యినాం | ... | 94 | 470 | 67 | 335 | 27 | 155 |
| | | 159-87 | 867-7 | 88-75 | 458-11 | 71-10 | 408-12 |

ఈ తరహాను మురుగు స్థితివున్నది. స్న 1263 ఫసలీ నుంచి జిరాయతీకి మురుగు తటస్థించినందుకు దరిమిలాను అప్రంగి మురుగు కాల్వ త్రవ్వించడం చేత యింజరం కాల్వకు వుత్తరంవయపుకొంతభూమికి మురుగు తగ్గి య 21¾ స్న 1271 ఫసలీనుంచి శేద్యంలో వస్తూవున్నట్టున్నూ ఇనాంలలోకూడా అదేప్రకారం స్న 1267 ఫసలి లగాయతు 63 న్ను స్న 1275 ఫసలీలో 4 న్ను జుమలాయ 67 శేద్యంలో వచ్చినట్టున్ను తెలియనస్తూవున్నది. నష్టం సంభవించిన భూమిలో జిరాయతీకి య 1-కి రు 7-8 చొప్పుననున్ను యినాందారుకు వచ్చే శిస్తు య 1-కి రు 5 చొ॥నున్ను వున్నట్టు కరణములు తెలియచేస్తారు. యినాంల శిస్తు య 1-కి రు. 5 వున్నట్టు యినుస్పెక్టరు పంపించిన కదపాలవల్లకూడా కనుపడుతూనే వున్నది. జిరాయతికి సదరు శిస్తురేటు కరారు అవునోకాదోనిశ్చయముగా చెప్పడమునకు అవకాశం కల్గలేదు. ఆనకట్టకాల్వలు రాకపూర్వం యీభూములు యావత్తూ శేద్యంలో వచ్చివున్నవని కరణములు చెప్పడం శివాయ వేరే లెఖనిదర్శనం కనపడలేదు.

యింజరం కాల్వకు దక్షిణ భాగమందువున్న జిరాయితీ యినాం య 55 భూమి దంగేరుమురుకాల్వలోకి ఆ గ్రామ పుంతలోనుంచి ఒక మురుగు కాల్వత్రవ్వి

స్తేనున్ను యింజనం కాల్వవు త్తరంగాముర్గులోవుండే భూమి విలాస గంగవరం కాల్వను కట్టిన ఆక్విడక్టు వెడల్పుచేయించి యిదివరకువున్న మురుగుకాల్వ బాగుచేయిస్తేను సాగుబడికి లాభము కావచ్చునని తోస్తుంది. అట్లా చేయవలసిన పనులసంగతి యింజనియ్యరు డిపార్టుమెంటువారు చూచి యస్టిమేటు చేయిస్తే అనుకూలంగా వుండగలదు. ప్రస్తుతం ముర్గులోవున్న చౌష్వన జిరాయితీ యీనాం య 7 చిల్లరనున్ను తగినమురుగు కాల్వలు త్రవ్వించే వరకు సాగుబడి లోకివచ్చే తరహా కనపడలేదు. యీభూమి యావత్తూ జమ్ము నీటితో సర్వదావుంటున్నది యింజనం కాల్వ నీటి యగడావువల్ల యీ ప్రకారము ముర్గు రావడముకు కారణమయినదని వాదుకకలిగివుంటున్నది. కావలసినహంశములలో ఒక్కదానికయినా కరణములు లెఖ సమాధానం చెప్పకుండా వుండుటవల్ల యెట్టిగా నిర్ధారణచేయుటకున్ను సందర్భములేకుండావున్నది. సదరుకరణాలను కూడా వారివద్దవున్న దరోబస్తు లెఖల సహితము హుజూరుకు హాజరు కావలసినందుకు తెలియచేసి పంపించినాను. కాబట్టి చిత్తానుసారం ఫయిసలు చేయించవలెనని వేడుకుంటూవున్నాను.

(b) గోదావరి డిస్ట్రిక్టు పెద్దాపురం తాలూకాలో చేరిన తోటపల్లి యస్టేటు యిలాకా రవుతంపూడి గ్రామస్తులు ఈ క్రిందవాళ్లు నిశానీలు చేసినవారు వ్రాసుకున్న మహాజరు అర్జీవిన్నపములు.

మజ్కూరులో ప్రజలవుపయోగము నిమిత్తము రెండు మంచినీళ్లనూతులు వున్న విగాని వాట్లలో వేసవికాలములో బొత్తుగా వుదకంలేక చాలా శ్రమపడుతూవున్నాము. సస్యములకు వుపయోగమయ్యే పంట చెర్వులుగాని సర్వకాలము నీరు వుండతగినటువంటివిన్ని పశువులకు వుపయోగమయినటునంటివిన్ని చెర్వులు ఏమిన్ని లేవు. అందువల్ల పశువులకు కూడా వేసవి కాలంలో నీళ్లు లేక మిక్కిలి శ్రమముగా వుంటూవున్నది.

గ్రామమునకు దక్షిణముగానుండే మంచినీళ్ల నూతికి ప్రక్కనున్నూ యేటి కాల్వకుదక్షిణముగానున్ను యిందుతో జతపడచిన ప్లానులో కనపరచిన నెం 867 రు య 3-79 ట్లుభూమి సెటిల్ మెంటుకుపూర్వం చెరువుగావుండి దర్శిలాను సికస్తు పడినందున రుద్రభూమిగా గవర్నమెంటులెఖలో వ్రాయబడినది. సదరు భూమిలో దక్షిణపు వయిపు సుమారు య 1-79 ట్ల భూమి మాత్రం రుద్రభూమిగావుపయోగపడుతూవున్నది. మా గ్రామకరణము చేసిన మషాతువల్ల ఇది నిజమయినట్టు ఏలినవారికి విశిదము కాగలదు. గవర్నమెంటు లెఖలలో భూమి అంతా రుద్రభూమి అని

నమోదుకానడం శుద్ధపొరబాటు. అందువల్లనే మాకు యీనరకు ఇంత వుపద్రవము నకు కారణమయినది. యేలినవారు మాగ్రామము ఒకసారి విజయంచేసి చూస్తే య 1-79 ట్లగాక తతిమ్మా భూమియావత్తు ఎప్పుడు వూటనీరు ప్రవహించి విశేష చీకాకుగా వుంటూవున్నట్టు విశదపడగలదు. ఈ భూమి సర్వకాలములయందు వూటనీరు ప్రవహించుచున్నందున వూటబాడువ అని వాడుకలో వున్నట్టుకూడా విశదం కాగలదు. ఈగ్రామములోని 14 వీసముల పశువ్వాలు యీ మార్గంగాను ప్లానులో కనపరచిన యే-బీ-సీ-డీ గుర్తులుగల పుంతలగుండాను పొలములోకి వెళ్లుతవి. ఈ మార్కు పుంత యితరగ్రామములనుంచి ఈ గ్రామము మీదుగా ప్రజలు వగయిరాలు వెళ్లేమార్గము అయివున్నది. వర్షాకాలములో వూటనీరు వరషపునీరుకల్సి బాడివడి పశువ్వాలు వగయిరాలు వెళ్లుటకు చాలా అసందర్భముగా వుంటూవున్నది. కాబట్టి యీ నెంబరు తా॥ య 3-79 ట్ల భూమిలో స్మశానముక్రింద వుపయోగముగాను య 1-39 ట్లు మినహాయించి తతిమ్మా భూమి ధర్మకోనేరుగా వుపయోగపర్చే యెడల మనుష్యులకు పశువులకు సుఖప్రదముగా వుంటుంది గనుక సదరు స్థలములోధర్మకోనేరు తవ్వుకొనుటకు సెలవు దయచేయించ కోర్తాము. తమ వుత్తరవుకాగా వేగమే తాలూకా బోర్డువారి సహాయం నిమిత్తం తిరుగా తమకు విన్నవించుకుంటూ వున్నాము.

(c) తోటపల్లి యిష్టేటులోకా లచ్చిరెడ్డి పాలెం గ్రామ మొఖాసాదార్లు వ్రాయించి దాఖలు చేసిన ముచ్చలికా.

1. మా తా॥ మొఖాసా గ్రామమయిన సదరు లచ్చిరెడ్డి పాలెంపయిని రెవె రేజుశిస్తు మింజుమలె పూర్వపు కట్టుబడి. రు. 300 లున్ను యిప్పుడు సర్కారు వారు ఏర్పరచిన నాలుగో వంతుకట్టుబడి రు. 124 లున్ను యీఅడుగున వుదహరించిన వాయిదాల ప్ర॥ సర్కారు వారికి ప్రతిసాలున చెల్లించి రసీదులు పుచ్చుకుంటూవుండగల వారము.

2. మాగ్రామ సరిహద్దులలోపలవుండే అడవులలో నరకబడే కలపను గురించి గవర్నమెంటువారు వారిగ్రామములో వసూలు చేయించే రేట్లకన్న మించకుండా కన్నఫీజు వసూలుచేసుకో గలవారము.

3. మా గ్రామములోనుండే చిల్లర యినాములమీద సర్కారువారికి చెల్లించవలసిన కట్టుబడి క్విటురెంటును గురించి సర్కారువారు అప్పటప్పట మాకు తెలియచేసే మొత్తం మేము వసూలుచేసి రు. 100 కి రు. 10 చొ॥ వసూలు చేసినందుకు

మేము ముజరాపుచ్చుకొని తక్కినపయికం పయివాయిదాల ప్రకారం సర్కారు వార్కి చెల్లించగల వారము. ఫాజులు ఏమయిన మేము ఐనూలుచేసిన యడల క్రమప్రకారము వాపసు దయచేయించడపు పూచీ సర్కారువారియందే వున్నది.

4. మా మొఖాసా గ్రామము పయిని అధికారం గవర్నమెంటువారు స్వంతముగా వుంచుకున్నందున అందులోని భూముల పయిని శివిల్ కోర్టువారికి ఏమిన్ని అధికారము లేదని నమ్ముతున్నాము.

5 మా మొఖాసా గ్రామములోవుండే భూముల విషయమయిన్ని రహితుల విషయమయిన్నిసర్కారువారు జారీచేయించే వుత్తరువులు ఆక్టులు అనుసరించి వ్యాహారం చేయగలవారము.

6. గవర్నమెంటువారు మాయందు కరుణించి నాలుగోవంతు పన్ను యేర్పరచినందున గవర్నమెంటువారికి కావలసి నప్పడు జరూరు సమయములలో కలెక్టరువారు వుత్తరవుల ప్ర॥ పోలయిసువారికి మద్దతు చేయగలవారము.

| | | | రు. |
|---|---|---|---|
| వాయిదాలు. | డిసంబరు నెల | 15 తేది. | 100 |
| | జనవరి. | డిటో | డిటో |
| | ఫిబ్రవరి. | డిటో | డిటో |
| | మార్చి | డిటో | డిటో |

## Translation.

Letter from the Tahsildar of Ramachendrapuram to the Collector of Godavari.

(a) I have herewith forwarded the particulars in respect of the submerged lands in Zemin Vegayammapeta in obedience to your order No. 468, dated 9th December 1865, after causing an enquiry to some extent made by the Revenue Inspector and having inspected the same lands personally. In spite of repeated directions to the kurnams of Vegayammapeta to bring the accounts of the individualwar engagements to cultivate the sub-merged lands and those in the vicinity as well as the cultivation accounts from fasli 1258 up to the current year, they have stated that such accounts do not exist. It was not on that account possible to compile and submit detailed accounts of the extents of cultivated and waste

lands. Agreements appeared to have been entered into in the case of some inam lands and copies of such made from the originals are enclosed herein.

*Submerged lands.*

| Items. | Submerged in the first instance. | | | | Subsequently brought under cultivation. | | | | Yet remaining submerged. | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | Extent. | | Assessment, | | Extent. | | Assessment. | | Extent. | | Assessment. | |
| | A. | CS. | RS. | A. | A. | CS. | RS. | A. | A. | CS. | RS. | A. |
| Cultivated (ryotwari) ... | 65 | 87 | 397 | 7 | 21 | 75 | 123 | 11 | 44 | 10 | 253 | 12 |
| Inam ... ... | 94 | ... | 470 | ... | 67 | ... | 335 | ... | 27 | ... | 155 | ... |
| | 159 | 87 | 867 | 7 | 88 | 75 | 458 | 11 | 71 | 10 | 408 | 12 |

Such is the nature of the submersion. It appears that subsequent to the commencement of the submersion of the cultivated lands in Fasli 1263, by reason of the opening of the Adrangi Channel, the submersion decreased to some extent to the north of Indaram Channel, and that consequently 215 acres have been reclaimed from Fasli 1271, and similarly 63 acres and 4 acres or a total of 67 acres have been reclaimed in Inam lands from Faslis 1267 and 1275 respectively. The kurnams acquaint me that the loss (by submersion) amounted to Rs. 7—8—0 per acre in ryotwari land and Rs. 5 per acre in Inam land. From the agreements forwarded by the (Revenue) Inspector, the (quit-rent) assesssment on the inam lands seems to be at Rs. 5 per acre. As to the fixity or otherwise of that rate of assessment for the ryotwari lands, it is not possible to state definitely. Beyond the oral statements of the kurnams that these lands were under cultivation prior to the advent of the anicut water, no proof is available from the accounts.

If a new channel be dug from the path in Indaram village and led into Dangeru channel, an extent of 55 acres of submerged land lying to the south of the Injaram channel may become cultivable, and similarly the extent lying to the north of the Injaram channel may be reclaimed if the aqueduct to the Vilasagangavaram channel

is widened and if the existing channel to that limit is repaired. It will be advantageous if the Engineering Department be desired to prepare an estimate for the execution of such works. It does not appear to me likely that the 7 and odd acres of inam land now under submersion may be reclaimed until adequate drainage channels are dug. This extent is overgrown with bullrush and always under water. It is talked of that the submersion as described is due to the 'flow' of the water in the Injaram channel. No opportunity exists to come to a decision definitely owing to the inability of the kurnams to explain by accounts any one of the required particulars. I have sent the said kurnams to present themselves at the Huzur office (District Head quarters) with all the accounts with them. I therefore pray that the matter may be disposed of as may be deemed fit.

(b) The memorial of the undersigned residents of Routhampudi comprised in the Thotapalli Estate, Peddapur Taluq, Godaveri District.

Two fresh-water wells exist in our village reserved for public use but we suffer much during the hot season from total scarcity of water therein. There are neither tanks for irrigation nor such as to contain water througout the year nor such to serve the cattle. During the summer, the cattle also suffer seriously for want of water.

The extent of 3 acres 79 cents comprised in Survey No. 847 lying to the south of the village and shown in the accompanying plan had been the site of a tank prior to the settlement when, having been found ruined, it was entered in the accounts as burial ground. In the said area, only one acre 79 cents situated on the southern part of it, is being used for the said purpose. This will appear correct to the authorities by the measurement made by the village kurnam. The entry in the Government accounts that the whole extent of it is burial ground is totally incorrect. It has been the cause of so much suffering to us till now. If your honor be pleased to kindly visit our village, it will be evident that this land, with the exception of 1 acre 79 cents, is ever overflown with a gushing spring and vexatiously damp, and that for this very reason it is popularly known as 'spring marshy land.' Fourteen-sixteenths of the cattle of the village reach the fields by the paths marked A. B.

C and D on the plan. The route marked as E is used by those going from other villages through this village. During the monsoons, the spring water and the rain water make it miry and therefore inconvenient for cattle to pass. Therefore, if after deducting 1 acre 79 cents used as burial ground from the total of 3 acres 79 cents, the remaining extent is utilised for a stone-faced tank in charity it will be comfortable for men and cattle. We therefore pray that we may be permitted to dig a stone-faced tank in charity on the said site. No sooner orders are passed, we shall again apply to you for help from the Taluq Board.

(c) The agreement executed and filed by the Mokhasadars (favorable tenure holders) of Lachireddipalem in the limits of Thotapalli Estate.

1. Out of the average assessment of our village on favorable tenure we agree to pay annually according to the kist-bandi noted below the previous fixed favorable quit-rent of Rs. 300 and also Rs. 124 being one-fourth of the favorable rent now fixed by the authorities and obtain receipts thetefor.

2. We agree to levy seigniorage on wood felled within the limits of our village at a rate not exceeding the rate leviable in Government villages.

3. We agree to collect the quit-rent on minor inams in our village as from time to time notified to us by the authorities and remit the amount according to the kistbandi less ten per cent for our expenses in collection. In case of excess collections, the discretion to refund the same vests with the authorities.

4. We believe that as the authorities have retained the general control of our village on favorable tenure with themselves, the Civil Court will have no cognizance over the lands therein.

5. We are bound to act up to the orders and regulations of the state in the matter of the lands and tenants of our "Mokhasa" village.

6. By reason of the state having been pleased to fix one-fourth assessment to us, we are bound to render assistance to the police whenever required by the state under the orders of the Collector.

| | | | |
|---|---|---|---|
| Kistbandi. | December | 15th | Rs. 100. |
| | January | Do. | Do. |
| | February | Do. | Do. |
| | March | Do. | Do. |

**1899.**

మ-రా-రా-శ్రీ, భీమునిపట్నం తా॥ పోలీసు యినస్పెక్టరుగారి సముఖమునకు.

ఫిర్యాదీ—కోట్టాం రంగస్వామి. సా. భీముల పట్నం.

ముద్దాయీ—చిట్టివలస బుచ్చన్న. సా. భీముల పట్నం.

హాజరు చింతలగుంట.

(*a*) పయిని ఇ. పి. కో. యొక్క 401-454 సె॥ ప్రకారం గుజరాయించిన ఛార్జివిన్నపములు,

1. పిర్యాదీకి ముద్దాయీవలిశలు బస్తా 1-కి సంచితో సహా రు 6-0-0 ఐంతున ధర నిర్ణయముకు భీమునిపట్నం బస్తీలో రెండువేలబస్తాలు చెలామణి చేయుటకు గత యేప్రిల్ నెల తే 5 దీ నిర్ణయంచుకొని ఫిర్యాదీ ముద్దాయీలు ఏకరితో నొకరు లిఖితరూపముగా ఖరారులు చేసుకున్నారు.

2. సదరు వప్పన్నము తాలూకు గత జూన్ నెలలో వచ్చిన లింగుఫీల్డు అనే స్టీమరులో యెగుమతీ నిమిత్తం ముద్దాయి తనతాలూకు బ్యాంకిలోనులోయున్న బాబ్బతు 1000 బస్తాలు ఫిర్యాదీకిముద్దాయీ యెగుమతికి యిచ్చినాడు. అందుల పైకం బ్యాంకిద్వారా రు॥ 5600 లున్ను ఆ నెల 26-వతేదీని సదరు వేయిబస్తాల నిమిత్తము 400 రూ॥ లున్ను చెల్లించవలసియున్నకురదా బ॥ 1000 లకు అడ్వాన్సు నిమిత్తము రు. 600 లున్ను జుమలా 6600 లు పిర్యాదీవల్ల ముద్దాయీ పుచ్చుకుని యున్నాడు.

3. పిమ్మట చెల్లించవలసిన బ॥ 1000 లు మింజుమలె యీ నెలలోవచ్చిన కోరంగియ నేస్టీమరులో యెగుమతీకీ బ॥ 471 మాత్రము ముద్దాయీ యిచ్చి బోటు చీట్లుపుచ్చుకుని తక్కిన 529 బస్తాలున్ను యెగుమతీ కొరకు తాను బ్యాంకివారికి లోనులోనుంచియున్న బా॥బ 500 ల్కు యెగుమతిఆర్డరు బ్యాంకివారిని కోరినాడు.

4. ఆప్రకారం బ్యాంకివారు యీ నెల 6 తేదినీ శలవు యివ్వనందున లోను బాధ్యత విడుదలచేశి ఫిర్యాదీకి బస్తాలు యిచ్చేనిమిత్తం యీ నెల 7 తేదీని ముద్దాయి ఫిర్యాదీని నమ్మించి ఫిర్యాదివల్ల రు. 4662-9-10 లుకు బ్యాంకివారిపైకి హుండీ పుచ్చుకుని బస్తాలు లోనులోనుంచి విడుదల చేసుకొనిఫిర్యాదీకి చెలామణి చేయవలసిన కురదా బ॥ 529 లున్ను యెగుమతి నిమిత్తం పిర్యాదీకి యివ్వక కాలయాపన

చేస్తూ ఫిర్యాదీ గయిరు హాజరు కాలములో ముద్దాయీ అదివరకు ఫిర్యాదీ తరఫున తూనికతనిఖీలు కాబడినటువంటిన్ని బ్యాంకివారి లోనులోవున్నటువంటిన్ని వలిశలు బస్తాలు పిర్యాదీవల్ల యివ్వబడ్డ హుండిపైకంవల్ల ముద్దాయీ లోను విడుదల చేసి స్వాధీన పర్చుకొని పిర్యాదీ తరపున గేటుతలుపులకు వేయబడిన తాళమును పగటివేళ ముద్దాయి బద్దలుగొట్టి బస్తాలు అందులోనుంచి పయికిచోరీగా తీసుకొని పోయి హరించినాడు.

5. సదరు కంట్రాక్టు యొకద్ద మాతాలూకు బ॥ 2000 లు వింజామలె బ॥ 1471 మాత్రముయీసరికి ముద్దాయీ పిర్యాదీకి పయిప్రకారం యిచ్చిరు. 1262-9-10 అప్పటప్పట యిదివరకు పిర్యాదీవల్ల ముద్దాయీ పుచ్చుకుని వుండిన్నికొదువ బ॥ 529 బస్తాలున్ను యిస్తానని అంటూ పిర్యాదీవల్ల ముద్దాయీకి లోగడవుండుకున్న కావేషిని పురస్కరించుకుని సదరు బస్తాలు యివ్వక దగాచేసిహరించినాడు.

1. ముద్దాయీపిర్యాదీని నమ్మించి పిర్యాదీవల్ల తనతాలూకు లోను విడుదల చేసుకొనే నిమిత్తంపయికము పుచ్చుకుని లోనువిడుదల కాబడిన బస్తాలు పిర్యాదీ నమ్మక ప్రకారం ఆసామ్ముకు బదులుగా ముద్దాయీ పిర్యాదీకి యివ్వక తానుహరించి నేరంగల విశ్వాసఘాతకము జరిగించడమున్ను,

2. గేటుతలుపులుకు పిర్యాదీ తరపున వేయబడ్డ తాళమును పగటివేళ ముద్దాయీ విరగకొట్టి అందులోవున్న బస్తాలు ముద్దాయీ చోరీగా తీసుకుని పోయి హరించడమున్ను,

3. పైసంగతులువల్ల యి॥ పి॥ కో॥ యొక్క 461-379,454-400 శె॥ ప్రకారం ముద్దాయీ నేరములు జర్గించినాడు కాబట్టి ముద్దాయీని శిక్షించగలందులకు పిర్యాదీ ప్రార్థించుచున్నాడు. చిత్తగించవలెను ది జూలై 22వ తేది 1891 సం.

(b) 1885 సం॥ జూలై 22 రోజుకు సరియయిన పార్థివ సం॥ ఆషాఢ శు॥ 12 గురువారంరోజున కృష్ణా డి॥ బాపట్లతాలూకా బాపట్ల సబ్‌రిజిష్ట్రార్ వుత్తరఖండములోచేరిన కాపరస్తుడు కాపుదనం వ్యవసాయదారు తడికెల రామన్న కొమారుడు వెంకటనాయుడికి మజ్కూరు కాపురస్తులు కాపుదనం వ్యవసాయదార్లు చీరాల ధర్మారావు నాయుడి కుమార్లు పెద్దరామదాసు నాయుడు యీ సన్యాశినాయుడు యీ వెంకటపతినాయుడు యీపెద్దినాయుడున్ను 4 రు వ్రాయించియిచ్చినస్వాధీనపు తనఖాపత్రం. మా అవుసరం నిమిత్తం మీవద్ద బదులుపుచ్చుకొని తారణ సం॥

వైశాఖ శు॥ 9 ఆదివారం రోజున మీపేర మేము వ్రాసినస్టాంపు దస్తావేజు తా॥ యీరోజున రుజ్వానలెక్క చూచుకోగా తేలిన బాకీ రు. రు. 553 లున్ను యీ స్టాంపు రిజిష్టరీ కర్చులు వగయిరాలు ని॥ యీరోజు మీవద్ద పుచ్చుకొన్న రు 8 లున్ను జమలా మీకు యివ్వతేలిన బాకి రు 561 అక్షరాలా అయిదువందుల అరవై యొక్క రూపాయి యిందుకు వడ్డి నెల 1-కి నూటికి రు. 1 వక్క రూపాయీ చొ॥ యిస్తుము యిందుకు తనఖా సదరు కాట్రవరం గ్రామంలో మాపేర పట్టా పుట్టబడి మా స్వాధీనానుభవంలోవున్నజిరాయితీ పల్లం నె 37 రు కేతు రు. 20 శిస్తుగల య 3 లు భూమిన్ని నె 299రు కేతు 117 లు శిస్తుగల య 19-50 భూమిన్ని తాటి వీరడు వగయిరాలు తా॥ మాకు క్రయమై మాస్వాధీనంలోవున్న జిరాయితీ పల్లం నె 31¼ రుకేతు రు. 4½ శిస్తుగల 75 శెంట్లు భూమిన్నీ జుమలా రు. 151-8 శిస్తుగల య 23-25 భూమిన్ని మీకు తనఖాయిచ్చి యీ రోజునే మీకు స్వాధీన పర్చడమ యినది గనుక సదరుభూములు మీ యిష్టంవచ్చిన రయితులకు అమరకంచేసి పండించిన పంటకు పెద్దమనుష్యులుచూచిన అంచనాకు వుభయరాశిన గ 1 కి బ॥ 3 చొ॥ మజారీపోగా శేషించిన అంబారంలో సంగోరు మాకు రావలశిన భూభాగంల్లో సదరు రూపాయీలకు యీసం॥ ఫాల్గుణ బ॥ 30 లుకు అయ్యేవడ్డి చెల్లుచూచుకుని మిగతా గల్లా మాకు యివ్వవలసినది. సదరు భూములు మీతనఖాలో వున్నంతకాలం ప్రతిసం॥ సదరు ప్ర॥ ముందు వడ్డీ ఫాల్గుణ॥ బ॥ 30 లు ధరను చెల్లుచూచుకుని మిగతా భాగం మాకు యిస్తూవుండవలసినది సదరు భూములు తా॥ సర్కారు శిస్తు ల్యాండుసెస్సులు మేమే చెల్లించి ఆరశీదు మీకువిలియావేతుము అలాగు మేము చెల్లించడం తప్పినప్పుడు ఆశాకి పయికం మీరు చెల్లించిన యడల యీ భూమికి వేరే శుద్ధక్రయచీటివ్రాసి యివ్వనక్కర లేకుండా మీకు యివ్వవలసిన బాకీకింద యిదేశుద్ధక్రయచీటిగాభావించి అంతటినుంచి క్రయంహక్కుగా సదరుభూములు మీ యిష్టానుసారం అములు జరుపుకుంటూ సర్కారు శిస్తు ల్యాండు సెస్సులుమీరే చెల్లించుకుంటూ వుండవలసినది. అసలు కింద పయిగామేము యిచ్చే సొమ్ముపుచ్చుకొని యిందుపయిన చెల్లుయిస్తూ వుండవలసినది. తనకా భూఫలం మీ వడ్డికి చాలనియడల మాయితరాస్తివల్ల ఆ వడ్డీ పయికం చెల్లించి యిందుపయిని చెల్లువ్రాయింతుము చెల్లుపోగా నిల్చివున్నఆసలీ ఫాయిదాలు విరోధి సం॥ ఫాల్గుణ బ॥ 30 లోగా యే సం॥ ఫాల్గుణ బ॥30 లుకు అయినా మేము యిచ్చిన యడల పుచ్చుకొని చెల్లువ్రాసి యీ దస్తావేజున్ను భూములున్నుమాకు స్వాధీన పర్చవలసినది. బాకీ తీరుమానముకు యిందు పయిని లేని చెల్లులు మాకు ముజరా యివ్వనక్కరలేదు.

(*c*) ముద్దాయీ బుద్ధిపూర్వకముగాను ఒడ్డారముగాను విచారణకు రాకపో యినాడనిగాని అతడు హాజరై అతనిమీద మోపబడిన నేరములకు జవాబు చెప్పు నట్లు అజ్ఞాపించునట్టి హుకుము జారీఅయిన తేదినుండి ఆరునెలలకు తక్కువకానట్టి న్యాయమైన కాలములోగా హాజరగుట మనస్సంబంధమైనట్టి లేక దేహసంబంధమై నట్టి వ్యాధికారణమువల్ల అసమర్థుడనిగాని రెకార్డు చేయబడు కారణమునుబట్టి, విచారణచేయునట్టి, రెవిన్యూ ఆఫీసరుకయినను ఖామందునకయినను తృప్తికర ముగా తోచినయెడల, సదరు విచారణను ముద్దాయీ గయిరుహాజరీలో చేయ వచ్చును. అయినను అట్టి సంగతిలోవిచారణను నడపుటకు ముందు సదరు రెవిన్యూ ఆఫీసరుగాని ఖామందుగాని పైనిచెప్పిన ప్రకారము, తనకు తృప్తికలిగెననియు సదరు విచారణ నిర్ణయింపబడు నొక తేదిని ఎక్సుపార్టిగా జరుపబడుననియు, తెలిపెడి యింకొక నోటీసును సదరు ముద్దాయికి జారీచేయవలయును,

Translation.

(*a*) To The Inspector of Police, Bhimilipatam.

*Complainant*—Kotnam Rangaswami, resident of Bimilipatam.

*Accused*—Chittavalasa Buchanna, inhabitant of Bimilipatam but at present at Chintagunta.

The complaint presented under Secs. 401, 454 I. P. C.—1. That the accused contracted with the complainant on the 5th of April last to supply the latter with 2,000 bags of ramtil or hill-gingelly seeds and deliver the same at Bimilipatam at the fixed rate of Rs. 6 per bag inclusive of the cost of bag and the contract was put into writing as between the complainant and the accused.

2. In pursuance of the said contract, the accused delivered to the complainant the 1,000 bags left as security with the bank in respect of a loan taken by him, for being shipped in S. S. Lingfield in June last. The accused has also received from the complainant Rs. 5,600 through the Bank, on the 26th of that month, Rs. 400 towards the balance due for the said 1,000 bags, and Rs. 600 on account of advance for the same or in all Rs. 6,600.

3. Out of the 1,000 bags yet to be delivered to me, the accused handed over only 471 bags and took boat notes to export the same per S. S. Coringa and requested an export order from the Bank for

the remaining 529 bags with reference to 500 bags he has left with them for the loan.

4. As the Bank refused to accept the proposal of the accused, he induced the complainant on the 7th idem to draw a hundi upon the Bank for Rs. 4662—9—10. promising to release the bags from liability and deliver them to the complainant, released the consignment from liability for the loan, evaded and failed to fulfil the contract in the matter of delivering the remaining 529 bags for being exported, obtained possession of the said bags which had been previously weighed and checked by the complainant, broke the lock put on to the gate on behalf of the complainant and removed the bags stealthily.

5. In the matter of the said contract for 2,000 bags, though the accused had till now delivered to the complainant 1,471 bags and received from time to time Rs. 12,262—9—10, he put off delivering the remaining 529 bags and defrauded (the complainant).

1. The accused caused the complainant to believe in him (accused) and induced the latter to pay the former for the purpose of releasing his debt (the loan with the Bank) and without delivering the bags in pursuance of the trust had committed the offence of criminal breach of trust.

2. The accused had again broken open during day-time the the lock put on the gate on behalf of the complainant and committed theft of the bags therein (secured).

3. Under these circumstances, the complainant prays that the accused may be dealt with for the offences he had committed under Secs. 461, 379, 454 and 409 I. P. C. 22nd July 1891.

(*b*) The usufructuary mortgage deed dated Thursday, the 12th of Ashada, Parthiva year corresponding to 22nd July 1885, executed in favor of Venkata Nayudu son of Thadikela Ramanna, a Kapu by caste, cultivator, and a resident of Katravaram in the Northern Division of the Sub-Registry of Bapatla, Bapatla Taluk, Krishna District, by Pedda Ramdoss Nayadu, E. Sanyasi Nayudu, E. Venkatapathi Nayudu, E. Venkatpeddi Nayadu sons of Cherala Dharmarow Nayudu, Kapus by caste and cultivators, residents of Katravaram.

On personally adjusting the accounts of the stamped document we have executed in your favor on Sunday, the 9th day of Vaisakha of Tharana year in the matter of the hand loan we have taken for our pressing need, the amount owing by us is found to be Rs. 553. Rs. 8 has been received to pay for stamp and registration expenses, and the total amount due by us is Rs. 561 (rupees five hundred aud sixty one). We shall pay interest on the above amount at one percent per month. We assign the lands mentioned below in Katravaram village comprised in our puttah and in our enjoyment as security for the said amount and have given possession of the same to you this day: cultivable wet field No. 37 measuring 3 acres, assessed at Rs. 20; fiield No. 292, measuring 19·50 acres assessed at Rs. 117; cultivable wet No. 314, measuring 75 cents assessed at Rs. 4—8—0, purchased from Thati Veeradu and others and now in our enjoyment, in all acres 23·25 paying an assessment of Rs. 141—8—0. You may lease the lands to whomsoever you may think (desirable), and deducting at the rate of 3 bags per garce on the estimated outturn of the yield by respectable men on account of wages for daily labourers, must credit the interest payable (by us) up to the 30th of dark Phalguna out of half the remainder available to our share delivering the residue to us. Until such time as the said lands are encumbered with you, the interest must be credited in the aforesaid manner at the rate current on the 30th of dark Phalguna and the remainder delivered to us. The assessment and the land &c cesses pertaining to the said lands shall be payable by us alone and the vouchers shown to you for verification. In case of default of such payment on our part and the same should be paid bv you, this may be construed as an absolute conveyance for the amount owing by us, without the necessity of a separate conveyance being executed in your favor, and you may from that date, exercise over the said lands all the rights vesting in a vendee, and deal with them according to your discretion paying the assessment, landcess, &c. You shall debit us with the separate amounts paid by us for the principal herein.

If the yield of the lands encumbered does not satisfy the interest payable to you, we shall remit the interest from (the income of our other properties and note the payment herein. If the balance of the amount of principal and interest due herein is paid on the

30th day of the dark Phalguna of any year within the 30th day of the dark Phalguna of Virodhi, you shall receive the same, endorse the discharge here on, and deliver back this document and the lands to us. Such of the payments as are not herein recorded need not be taken into consideration at the settlement of the amount due by us

(*c*) If it appears to the satisfaction of a Revenue officer conducting an enquiry or his superior that the accused had either intentionally or stubbornly failed, or that he had been, from facts on record, either mentally or from bodily ailment incapacitated, to attend within a reasonable time not exceeding six months from the date of the order issued to him to answer the charges brought against him, the said enquiry may be made *exparte*. However, before proceeding with the enquiry, the said Revenue officer or his superior shall, in such a case, issue a further notice to the accused communicating his satisfaction as above and the date on which the *exparte* enquiry will be held.

## 1903.

(1) మొదటికలాను రివిన్యూ యిన్స్పెక్టరు మ-రా-రా-శ్రీ, గుంటూరు తహశ్శీల్దారు గారికిపంపించుకొన్న రిపోర్టు. తమ హయాములోనున్న గ్రామములలో చేరియున్న నా సర్కిలు గ్రామమైనచెందూరిలో పోయినవారము ముకాముచేసి అక్కడ జరుగుచున్న పనులన్నిటిని తనిఖిచేసినాను. అందువిషయమై నేను కనిపెట్టిన విశేషము లేవనగా దానిలో యిటీవల జరిగియున్న చోరీనిగూర్చి న్యాయశాస్త్రతః విమర్శచేసి తమకు రిపోర్టుచేయుటకు బద్ధుడై యుండిన హేడు ఆ గ్రామమును పైయధికారుల వుత్తర్వు లేకనే ఆ నాటిరాత్రి విడిచిపోయి రెండుదినములయిన తర్వాత తిరిగివచ్చి పోలీసువారికి తెలియజేసి ఎకరార్లు తీయుటకుగాను వారు జరిపించిన దౌర్జన్యమును బాధాచరణమునుచూచి వుపేక్షించి యుండినాడని నేను చేసిన విచారణవల్ల తెలియవచ్చినది.

రయితులకు జారీచేయుటకుగాను తమరు నంబరువేసి సీలువేసి వ్రాయని రసీదుల నమూనాలపుస్తకములు ఇంకా హేడ్డుమనకు సప్వరాచేయబడి యుండలేదు. బాకీ పన్నుకును ప్రస్తుతపు పన్నుకునురయితులు చెల్లింపవలసిన మొత్తములను ఆవశ్యకమైన వివరణములతో ఎప్పటికప్పుడే దాఖలు చేసుకొని హేడ్డును. కరణములు

యిద్దరును తమ సంతకములవలన వాటిని యదార్థపరుపవలయునని వారికి జ్ఞాపకపరచియున్నాను. వసూలయిన పయికమును చిట్టా బుక్కులలో జమకట్టుకొని ప్రతికిస్తీకి సంబంధించిన వసూళ్లు పూర్తిగా చేయబడినవో లేదో చూచుకొని తాలూకా ఖజానకు దానిని ఇరసాలు చేయుటకుగాను నమ్మకముగల చాలినంతటి కాపదలతో కూడ వెట్టివాండ్ర జవాబుదారీమీద పంపుచుండవలయుననికూడా జ్ఞాపకపరచియున్నాను ప్రోసెస్సులను జారీచేయడము కొరకున్న చట్టమువల్ల విధింపబడియున్న క్రమములను ఆ గ్రామాధికారులు తాము పూర్తిగా అవలంబించుటకుగాను విశేషజాగ్రత కలిగియుండునట్టె కనబడినది. ఆధీనములో లేని సామాన్య శిస్తు భూములకొరకై కొన్ని దరఖాస్తులు గ్రామ ఉద్యోగస్తులకు పంపబడియున్నవి. వారు వాటిని క్రమప్రకారము రిజస్టరులో తక్షణమే నమూదుచేసుకొని అటుతర్వాత వాటివిషయము దండోరా వేయించి AI నమూనా ప్రకారము యాదాస్తులను తయారుచేయించి భూమి ఖామందులను తెలిపే AII నమూనా ప్రకారముండు జాబితాను చేర్చి తమ సన్నిధికి పంపుతామని వారన్నారు. మరమ్మతుచేయుటకుగాను యత్నములో వున్నటువంటి చెడిపోయిన చెరువులక్రింది ఆయకట్ల అనుభవదార్లు కొందరు వారి భూములను బోర్డువారి ప్రత్యేకమైన అంగీకారము లేకయే విడుదల పెట్టుకొనవలెనని ప్రయత్నించినందున ఆ గ్రామఉద్యోగస్తులు సదరు విడుదలను పుచ్చుకొనలేదని చెప్పుకొన్నా. సెటిల్మెంటు డిపార్టుమెంటువారిచేయింకా తరము యేర్పరచబడని భూములలో నీళ్లుచాలకపోవుటవల్ల పయిర్లకు కొంత నష్టము కలిగినందున రూల్సు ప్రకారము నభరువారీ నష్టములను మదింపజేయకయే బంజరు భూములను మినహాయించి పారుదల పనియొక్క ఆయకట్టునుగురించి మాత్రమే ప్రత్యేకముగా ఆలోచించి ముజరాను ఇచ్చుటకు తమకు శిఫారసు చేసియున్నాను. తమరు త్వరలోనే జమాబంది జరిగించుటకుగాను వత్తురనే తమహుకుములనుబట్టి నమోదులకన్నిటికి కాలీ స్థలములువుంచి కరణము లెక్కలను తయారుచేసి వుంచుకొన్నాడు. గ్రామనత్తములో దావాలేనిచోట్లు కొన్ని కట్టడముల పనులకుగాను కలెక్టరు దొరవారునిర్ణయపరచినట్లు తమరు ఇంకను దయచేసియుండలేదని దరఖాస్తులు పెట్టుకొనియున్నవారు నాతో చెప్పుకొనినందున తమతో మనవిచేసుకొనుచున్నాను. గ్రామపొలముల కొలతపనిచేయుటకుగాను తరిఖీతు కావలసినదని పంపబడిన రామయ్య అనే కరణము గొలుసును ఆఫ్సెట్టుఘుడను క్రాస్టాపును కొద్దిగా వుపయోగించుటను మాత్రమే ఇప్పటికి నేర్చుకొన్నాడుగాని యింకా అయిమూలలకొలతను సరిహద్దులోనుండే

అన్ని కనులను ఆఫ్సెట్లను కొలవడమును నేర్చుకొనలేదు. గ్రామరిజిస్టరుయొక్క గోష్వారాను తయారుచేసే మార్గము నేర్చుకోవడమున్ను ప్రతిబ్లాకును అందులోనున్న సర్వేపొలములతోను అంతర్భాగములను ప్లాటుచేసి ప్రతియంతర్భాగముయొక్క విస్తీర్ణమును యేరియాసైక్ల్వారుతో తీసుకోవడమున్ను వాటినిఫీల్డు రిజిస్టరులో నమోదు చేయడమున్ను నేర్చుకోవడమున్ను యింకామూడురోజులుపట్టునని చెప్పినాడు. గ్రామములో ముసురు జాడ్యము దొమ్మరోగము కాలుసీటివ్రాతచెంచజాడ్యములు మొదలయినకొన్ని పశుజాడ్యములు అచ్చటచ్చట కనిపించియున్నందువల్ల కాపులుచాలా యిబ్బంది పడుచున్నారు. విశదపర్చడమైనది.

(2) 1802-వ సంవత్సరపు మద్రాసు శాశ్వతపు ఫైసలాయతి రెగ్యులేషనుయొక్క 8-వసెక్షనులో యేమి చెప్పబడియున్నను సరే నిమిత్తములేకుండ, అట్టి ప్రతియొస్టేటు పిత్రార్జితముగావుండి ఆ యస్టేటు ఖామందు దాయభాగ విషయమైన సాధారణ శాసనమునసుసరించి వర్తించునట్టియొక్క హిందూ అవిభక్త కుటుంబమునకు నిర్వాహిగావున్న పక్షమందు అతడు చేయు (ఏలియినేషను) వినిమయము చట్టమునకు అనుగుణముగానుండు సందర్భములలోతప్ప అతడు తన యొస్టేటును గాని అందలి యే భాగమునుగాని వినిమయము చేయగూడదు. మరియు ఈ యాక్టు జారీ కాబడిన తర్వాత అట్టి ఖామందువలన పైన చెప్పినట్టి సందర్భములలో కాకుండా వేరు సందర్భములలోచేయబడిన రుణములనుగురించినటువంటి యే డిక్రీలను గాని షెడ్యూలుతో చేర్చబడిన అతని యొస్టేటుమీద అములు జరిగింప గూడదు. షెడ్యూలలో చేర్చబడియుండు. ఏ యొస్టేటునైనను అవిభాజ్యముగాను వినిమయానర్హముగాను కాపాడి పెట్టుటకు అది అసాధ్యమయినంత ఋణగ్రస్తమయియున్నదని లోకల్ గవర్నమెంటువారు అభిప్రాయపడుపక్షములందు వారు సదరు ఎస్టేటును షెడ్యూలునుండి తొలగించునట్లు ప్రకటన మూలముగా ఆజ్ఞాపించి మరియు ఒక యొస్టేటులో కొంతభాగమును కాపాడగలందులకయి తక్కినభాగమును వినిమయము చేయవలసియున్నప్పుడు దానిని అదేవిధముగా తొలగింప వచ్చును.

(3) అయినప్పటికిన్ని యీ సెక్షనుకు పైక్లాజులో వివరించివున్న వ్యాజ్యములయందు వ్యాజ్యము తెచ్చుటకు పూర్వము 12 సంవత్సరములలోగా వ్యాజ్యకారణము కలిగిన పక్షమందు లేక వ్యాజ్యాధారమైన పైకమునైనా వస్తువునైనా వాది తగాదా చేసియుండి అది న్యాయమేనని ప్రతివాది వొప్పుకొని వున్నట్లు స్పష్టముగానున్ను దృఢముగానున్ను వాది రుజువు అగుపరిచిన పక్షమందులేక పైన

చెప్పిన కాలములోగా యుక్తమైన అధికార్ల యెదుట తత్‌క్షణము ఫిర్యాదుచేసి వున్నట్టయితే యెందువల్ల వ్యాజ్యము జరిగించలేదో అందుకు తృప్తికరమైన కారణములను పంచాయతీ వారికి కనపరచిన పక్షమందు యిటువంటి పక్షములలోనేగాని వ్యాజ్యములను పట్టకూడదు. గ్రామ పంచాయతీలో చేరియుండు ఘరానామనుష్యులుచేసిన తీర్పుయొక్క నకలును వాదిగాని ప్రతివాది గానిపుచ్చుకొనుటకు స్వయముగానైనను వకీలు మూలముగానైనను హాజరుకాని పక్షమందు లేక హాజరైపుచ్చుకొనుటకు నిరాకరించిన పక్షమందు ఆ సంగతిని తారీఖు సమేతు గ్రామ మునసీపు కరణముచేత వ్రాయించి దస్కతు చేయించి తానున్ను సంతకముచేసి కక్షిదారునికి ఇవ్వగలందులకై గ్రామ కరణము వద్ద వుంచవలసినది.

(4) ఒక హిందువు అతడు నేర్చిన విద్యవల్ల సంపాందిచే సొత్తుసదరు విద్య సమిష్టికుటుంబముయొక్క ద్రవ్యమును ఖర్చుపెట్టిగాని సమిష్టికుటుంబములో చేరినవాని ఉపాధ్యాయత్వము వగైరాలవల్లగాని నేర్పింపబడినదైనను అతనియొక్క ప్రత్యేకమైన సొత్తుగా భావింపబడేటట్లు జేయుటకై ఒక చిన్న చట్టము తయారు చేయబడి జనులయొక్క ఆకళింపు నిమిత్తమును వారి సమ్మత అసమ్మతములను తెలుసుకొనే నిమిత్తమును ప్రకటించిన మీదట అది అంతటిలో మొదట అడుగం పేపోయెను. దానిలో విద్య అనుమాటకు ప్రథమ శిక్షాసంబంధమైనను సరే పూజ్యత గలదయినను సరే, సాంకేతికమైనను సరే, శాస్త్ర సంబంధమైనను సరే, చదువు అనిన్నీ వర్తకము కాయ కష్టములేక జీవనోపాయము జరుపుకొనేలాగు, ఒకనికి శక్తిని కలిగించుటకు మామూలుగా ఉద్దేశింపబడునట్టియే విధమైన తరిబీతు అయినా అనిన్నీ విద్యాదాయమను మాటకు విద్యప్రధాన మూలముగా సంపాదింపబడిన యావత్తు సొత్తు అనిన్నీ సదరు సంపాదన యీ చట్టము అమలులోకి వచ్చుటకు ముందుగాజరిగినను పిమ్మట జరిగినను సరే అనిన్నీ సదరు సంపాద్యము అట్టి విద్యయొక్క సామాన్య ఫలితమైనను, అసామాన్య ఫలితమైనను సరే అనిన్నీ అర్థము చేయబడినది. విద్యాదాయమునుగూర్చి హైకోర్టుయొక్క తీరుమానములను పరికించుచుండగా సమిష్టి కుటుంబములయొక్క ద్రవ్యమును ఖర్చుపెట్టి ఒకనికి కొద్దిపాటిలేక సామాన్య విద్యమాత్రమే నేర్పింపబడినయెడల సదరు విద్యవల్ల అతడు సంపాదించే సొత్తు అతనికి ప్రత్యేకపు సొత్తుగా భావింప బడవలసినదనియుసమిష్టి ద్రవ్యమును ఖర్చుపెట్టి యేదయినను లాభకారి కాగల విశేషవిద్యగాని గొప్పవిద్యగాని ఒకనికి నేర్పింపబడిన యెడల సదరువిద్యయే ప్రధానమూలముగా అతడు సంపాదించే

సొత్తు సమిష్టి సొత్తుగా భావింపబడుననియు కనబడుచున్నది. యిట్లున్నను యిట్టిది కొద్దివిద్య, యిట్టిదిగొప్పది, యిట్టిది సామాన్యవిద్య, యిట్టిది విశేషవిద్య అనినిర్ధారణచేయుట శక్యముకాదనియు సదరు విద్యనిమిత్తము సమిష్టిద్రవ్యము ఖర్చుపడినను పడకపోయినను సరే దానివల్లసంపాదింపబడిన సొత్తు సంపాదించిన వాని ప్రత్యేకపు సొత్తియినట్టుస్పష్టముగా నొక చట్టమును చేయుటవల్ల జనులకు చాల మేలు కలుగునని పట్టుపట్టడమైనది. హిందూధర్మశాస్త్రములో చెప్పబడిన పనులను సదరు విద్యాదాయపు చట్టము తలక్రింద చేయుచున్నదనియు సమిష్టి ద్రవ్యమును ఖర్చుపెట్టి కొన్ని సందర్భములయందు కుటుంబములో తక్కినవారు తమ కడుపుకట్టుకొని అప్పులుచేసి కష్టములపాలై ముందు బాగుపడవలెననే ఆశతో ఒకనికి విద్యనేర్పించినపుడుఆతని సంపాద్యములో ఎంతమాత్రమైననుహక్కులేదని చెప్పుటచాలా అన్యాయమనియు సదరుచట్టము ప్యాసయిన యెడల కుటుంబములోతెలివిగలవానికయినను సమిష్టి ద్రవ్యము అధికముగాఖర్చుపెట్టి విద్య చెప్పించుటకు ప్రోత్సాహము నశించుననియు పైవాదమును ఖండించుచు వాదింపబడెను.

## Translation.

Report submitted to the Tahsildar of Guntur by the first class Revenue Inspector.

During the last week I camped at Chendur within your jurisdiction and in my firka and in overchecking the affairs going on there discovered the following particulars: it has been elicited during my enquiry that the Head (of Police), who was legally bound to investigate and report upon the case of theft that had occured there, has left the village in the absence of orders from his superiors and returned two days after and had further omitted to intimate to the Police and take action in respect of the assault and violence committed by them in recording confessions. The Head (of Police) has not yet furnished me with the blank book of forms of receipts numbered and sealed by you to be issued to the ryots. I have reminded the Head man and the kurnam that they should then and there make out (a statement of) the necessary particulars showing the arrears and the current (demand of) asseesment payable by the ryots and attest it with their signatures in token of the accuracy of the same. I have also reminded them that the (amount of) assessment collected should be credited in the chittah and, after ascertain-

ing whether the collections in respect of each kist have been completed or not, the same remitted to the treasury on the responsibility of vettis through a reliable person with adequate safeguard. It appeared to me that the village officers are sufficiently alive to serve the processes and carry out fully the legal provisions. A few durkhast applications for assessed waste lands have been received by the village officers. The latter stated that they will as usual register the applications, prepare the AI memoranda after notifying the fact by beat of tom-tom and forward them to you appending the list of owners in pursuance of the AII memorandum. As some of the occupiers attempted to relinquish, in the absence of special orders from the Board, their lands under the ruined tanks proposed to be repaired, the village officers informed me that they had not received the said relinquishments. Owing to partial loss of crop from deficiency of water on lands which have not yet been classified by the settlement department, I have recommended the grant of remission according to rules, calculated not with reference to individual losses, but solely with reference to the irrigable extent excluding the waste. In pursuance to the order that you will arrive soon to conduct the Jamabaudi, the kurnam has compiled the accounts leaving blank spaces therein for your remarks. I beg to submit that the applicants for the unclaimed portions of the existing village site have brought to my notice that the Collector has ordered the assignment of the same for building purposes, and that the said order of assignment has not as yet been communicated to them by you. Kurnam Ramayya, deputed to be trained in field measurement, has only learnt till now to use the chain, off-set, the staff, and the cross-staff, and has not learnt to take the angular measurements and the off-sets of the angles at the terminal boundaries. He expressed that it will take three days more for him to understand the method of preparing the abstract to the village register, to plot according to scale each block with the survey fields therein, also note the sub-divisions with their respective measurements, and enter the same in the field register. Here and there in the village cattle diseases such as anthrax, rinderpest, foot-and-mouth disease and tuberculosis prevail and the ryots are inconvenienced thereby. (I) have explained (the matters).

(2) Notwithstanding anything contained in section 8 of the Madras Permanent Settlement Regulation of 1802, the proprietor of every such estate shall be restricted from alienating his estate or any portion thereof except in circumstances where alienation would be permissible by law if the estate were ancestral property and the proprietors occupied the position of managing member of a joint Hindu family governed by the ordinary law of succession; and no decrees for debts contracted after the passing of this Act by such proprietor otherwise than under the circumstances aforesaid shall be executed against his scheduled estate. The Local Government is of opinion that a scheduled estate is too heavily encumbered to be preserved as an impartible and inalienable estate may, by notification, direct such estate to be excluded from the schedule and may similarly exclude any portion which it may be necessary to alienate in order to preserve the remainder.

(3) The suits shall not be entertained provided, however, that in the cases specified in the preceding clause of this section the cause of action has arisen within twelve years previous to the institution of the suit, or that the plaintiff do shew by clear and positive proof either that he had demanded the money or matter in question, and that the defendant had admitted the justice of the demand; or that he had directly preferred his claim within the period abovementioned to a competent authority and in such case that he assign satisfactory reasons to the panchayat why he did not proceed with the suit. If either the plaintiff or defendant shall fail to appear in person or by vakil to receive a copy of the decree, or having attended, shall refuse to receive a copy, the Village Munsiff shall cause the Karnam to endorse on the copy intended for such party such omission or refusal and the date; the Village Munsiff shall attest the same with his signature, which shall be witnessed by the Kurnam; the copy so endorsed shall be deposited with the village Karnam to be delivered to the party afterwards claiming it.

(4) When a short Bill, to declare that all acquisitions made by a Hindu by means of his learning, whether that learning was imparted at the expense of the joint family or by the tution &c., of a member thereof, or his exclusive property, was drafted and published for the comprehension of the public in view to ascertain their

assent or dissent thereto, it collapsed at the initial stage. By 'learning' was therein meant education whether elementary or liberal, technical or scientific, or any training whatever ordinarily intended to equip one for trade, manual labour, or livelihood; and by 'gains of learning' was meant all acquisition to which education was the stepping-stone whether made either prior or subsequent to the operation of the said Act, and whether the source of the gains is ordinary or extraordinary education. On a scrutiny of the decisions of the High Courts, it appears that the income acquired by one who has received a little or elementary education at the family expense has to be regarded as his exclusive (property) acquisition, and that by one who had been imparted instruction with the joint family funds in some special branch of science or liberal education which is the immediate source of the gains, has to be regarded as joint property. The determination of learning as elementary, liberal, ordinary or extraordinary not being possible, it has been urged that a short enactment distinctly laying down that all acquisitions made by a person by means of his learning shall form his separate and exclusive property, irrespective of the assistance which he may have derived from family funds, would tend to the public weal. In opposition of the Bill it has been argued that the aforesaid Gains of learning Bill reverses the principles of the Hindu law, that it would be highly illegal to disclaim to any extent the income of a person who has been instructed at the expense of the joint family funds in connection with which the other members of the family have on occasions stinted (and starved) themselves, become indebted and submitted themselves to hardships, for prosperity in the future, and that the passing of the Bill would do away with the stimulus on the part of even a discreet member of the family to educate another member at a heavy outlay from the joint family funds.

## 1904.

ఒక బస్తీలోని సుంకపు మెట్టువద్ద నొకమనుష్యుడు హాసీలు చెల్లించకుండా కొన్ని సామానులను తీసుకొని చౌకీదాటిపోవుచుండగా గస్తీతిరుగుచుండిన మజ్కూరు బంట్రోతులు వానిని పట్టుకొని సాయరు గుమాస్తాయెదుట హాజరు చేసి నంతట ఆతడు తనికీచేసినప్పుడు సదరుహీ పల్లెటూరివాడు కనుక బస్తీ మర్యాదలు

was mine. Thereupon, I reported the matter to the village munsiff. Having received some bribe at the hands of the Sahib, he decided only in his favor. Impugning the justice in the matter, when I had gone to fell a tree in the dry land situated to the west of the tank-bund, he pushed me by the neck saying "if you step into my land, I shall cut and bury you there"; on the next day while I was on my way to the carpenter's house to have the plough-share mended, he was sitting at the tree where the villagers used to meet, here he called me all sorts of names and struck me twice or thrice on the back with a thorny stick threatening me, "Beware! go, go." I pray that you will not only protect me from being submitted to any harm at the hands of the Sahib who, with the support of the village munsiff, beat me and is endeavouring to come by the lands in my possession, but also to cause justice to be administered so that I might regain my possession thereof.

## 1897.

### (a) తుని డివిజను డిప్టీ తహశీలుదారు వ్రాసుకొన్న విన్నపములు.

కోరాం తాలూకా జమీందారువారు ఆ జమీందారీ యిలాకా కోరాంశి వారు జగన్నాథపురంగ్రామములో వంతువాళ్లకు తమ నవుకరి నిమిత్తముపుట్టినభూములు వంతు బెన్నాయ వగయిరాలు అనుభవిస్తూ తమ నవుకరీ చేయడం మానివేసినారు అనే మొనలయిన సంగతులతో క్రిందటి నెల ది 15 తారీఖున వ్రాసుకొన్న అర్జీ ఆ నెల 19 తారీఖుగల యండార్సుమెంటుతో రిపోర్టు నిమిత్తం నాకు రిఫరు అయినందున, చేయకుండావున్న ఆసాముల పేర్లు తెలియ చేయవలసినదని జమీందారు వారిపేర యాదస్తు వ్రాస్తే, వకాలతునామా సహితంగా వకీళ్లను పంపిస్తూ, తపశీలు వారివల్ల తెలియగలదని క్రిందటి నెల ది 13 తారీఖున జవాబువ్రాసినందున, వకీళ్లు తెలియచేసిన బెన్నాయ వగయిరా 8 గురినిన్ని, వకీళ్లు గోరిన సాక్షులనున్ను తలబుచేసి విచారణ చేయడమయినది.

పంకు బెన్నాయ అనేవాడు అతను సహా పన్నెండుగురు జనముతో తమ నవుకరీ అనగా అయివజు కయిలు చేయించి కాపలావుండడం ఖజానాలతోనున్ను తమతోనున్ను తమ రాజబంధువులతోనున్ను గ్రామాంతరములకు వెళ్లుతూవుండడం, పహరా చౌకీలు యివ్వడం, పితూరీలు తటస్థమయినప్పుడు హాజరయి

తమ వుత్తరవుల ప్రకారం నివారణ చేయడం మొదలయిన నవుకరీ చేయడం వాండ్ల నిర్ణయము అనిన్ని ఆటువంటి నవుకరీ నిమిత్తమే అతని పూర్వులకు సదరు జగన్నాథపురములోజిరాయతీలోనుంచి భూములు యివ్వబడి అవి శాశ్వతపు భూబందులో జిరాయతీ హెడ్డుల సమూదుఆయినవనిన్ని, వాటిని అనుభవిస్తూ బెన్నాయతాత తండ్రులున్ను దరిమిలాను అతనున్ను నిర్ణయమయిన నవుకరీ చేస్తూ భూములు అనుభవిస్తూ వచ్చినారు అనిన్ని. ఆ భూములు జిరాయతీ హెడ్డులోతమ నవుకరీనిమిత్తం అవి సమూదు అయినందున యినాం కమీషనరువారు క్విటురెంటు ఫయిసలుచేసియుండలేదు అనిన్ని; సదరు పన్నెండుగురు మింజాములెకొత్తాంశివారు పంగనాకలలోవున్న నలుగురుకొండవాండ్లు యిప్పటికిన్ని, నవుకరీ చేస్తున్నారు అనిన్ని, బెన్నాయ వగైరా ఎనమండుగురు మాత్రమే యిటీవల కొంతకాలమునుంచి నవుకరీ చేయడంలేదనిన్ని, బెన్నాయ తండ్రి ఈవిషయమయి తమకు ముచ్చిలికా కూడా దాఖలుచేసి ఉన్నాడు అనిన్ని, అతను చనిపోయిన తరువాత ఆభూములు జప్తుచేస్తే బెన్నాయ హాజరయి అతనితండ్రి చేస్తూవున్న అన్ని విధములయిన నవుకరీలను నిర్ణయమైన జనముతో తాను చేయడమునకు వప్పుకొని అర్జీ దాఖలు చేసినందున భూములు తిరిగి అతనికి బహాలుచేసి వుండడమయినదనిన్ని మొదలయిన సంగతులు జమీందారువారి వకీల్లు కయిఫియ్యతువ్రాయిస్తూ, బెన్నాయ యేమి బెన్నాయతండ్రి యేమి అవిచ్ఛిన్నముగా నవుకరీ చేస్తూవున్నందున దాఖలాకొరకు లేటు డిప్టితహశీలుదార్లు వ్రాయించిన యినాయతు నామాలు, తమవద్ద ఉన్న హుకుముల యెంటరు బుక్కులను పట్టి తయారుచేసిన జాబితానున్ను ధాకలుచేసినారు. మరిన్ని సదరు సంగతులు వారి తరపు సాక్షులవల్ల పూర్తిగా రుజువుపర్చినారు.

తనకు సదరు భూములు జమీందారువారి నవుఖరీ నిమిత్తం పుట్టలేదనిన్ని, మొఖాసా పుట్టునవిఅనిన్ని తనవద్ద వుండే దస్తావేజులు కాలిపోయినవనిన్ని బెన్నాయ రులియచేస్తాడు. కాని అతనుచెప్పేసంగతులు నేను విశ్వసించను. మొఖాసా అని ఋజువు చేయవలసిన బాధ్యత అతనియందు వున్నప్పటికిదస్తావేజులు కాలిపోయినవని ఒక సబబు చెప్పుతున్నాడు.

కాబట్టి యీ సంగతులు చిత్తానకు జాహీరు నిమిత్తం విన్నపంవ్రాసుకొని యిందున గురించిచిత్తానుసారంగా హుకుం జారీ కాగలందులకు ప్రార్థిస్తూ యీకేసుతో సంబంధించిన కాగితములుపేరస్తు సహితం యిందుతో పంపుతున్నాను.

(*a*) ఏలూరు తాలూకా తహశీలుదారు వ్రాసుకొనిన అర్జీ.

డిస్త్రిక్టు గజెటీలోని నె 4 య సరిక్యూలరులో ఆజ్ఞాపించిన ప్రకారం మనవి వ్రాసుకొనేదియేమంటే.

తాలూకా ఖిలాకా గ్రామముల పయిని ఫిబ్రవరి ఆఖరువరకు రు 225-3-6 బాకీవున్నందున ఆ పయికం వాయిదాల ప్రకారం వసూలు కావడముకు వాయిదా నోటీసులున్ను డిమెండ్లున్ను జారీచేసివున్నాను. యీ నెలలో అనగా మార్చి నెలలో చాలాపయికం వసూలు అయినది. క్రిందటి నెలాఖరువరకున్ను జమాబందీ జరుగుతూ వున్నందున యే యే రయితులు యెంతశిస్తు శిసలుగా యేర్పడ్డది తెల్సుకోవడముకు సాధ్యముకాక యీ నెలలో యీసత్తుపన్ను శిసలుచేసి పయికం వసూలుచేస్తూవున్నాను, యీ నెలలోనే బాకీ యీసత్తున్ను వసూలు పరుచుటకు తగిన యేర్పాటులు చేసినానుకాని రహితులు కొందఱు పాయకారులు అగుట చేతను ద్వారకాతిరుమల దేవస్థానపు బాకీ వసూలు కావడం అనుమానముగా వుండుటచేతను జాడాగా వసూలు చేయగలనో లేదో అని భీతిగావున్నది. ద్వారకాతిరుమల దేవస్థానపు బాబతు రు 189 లు అర్చకులు ప్రస్తుతం అర్చకత్వంపని చూస్తూవున్నప్పటికి వారికిన్ని ధర్మకర్తకు జరుగుతూవుండే వ్యాజ్యము అప్పీలులో ఉన్నందున అది తమపక్షముఆయితేనేగాని చెల్లించుటకు సాధ్యము కాదని అంటూవున్నారు. మరిన్ని 18 రూపాయీలు తకరారుబాపతు క్రింద ఉన్నదిగనుక అందు విషయములో ఫయిసలు ఉత్తరవులు జారీఆయ్యేవరకు వసూలుకాదగి ఉండలేదు.

## Translation.

(*a*) Letter from the Deputy Tahsildar, Tuni Division.

My letter dated the 15th ultimo bringing to your notice that the servants Bennaya, &c., for whose service by turns inam lands have been assigned in Jagannathapuram, a hamlet of Kottam within the limits of the Kottam Zemindari and the same enjoyed by them, have committed default in respect of the service, &c., was referred to me for report with the endorsement dated the 19th idem. I therefore addressed the Zemindar to acquaint me with the names of those who have committed default in service. He sent vakils with vakalutnamahs and replied on the 13th idem that the matter was ascertainable from the particulars the eight persons including Ben-

naya and the others were examined along with the witnesses who have been summoned as desired by the vakils.

The Zemindar's vakils filed a statement urging among other things that the said Bennaya with eleven others have undertaken with the Zemindar to measure the harvested grain and guard it, to escort the treasure, to follow the Zemindar and his relations on tour, to work as guards and sentries, to carry out the Zemindar's order and suppress robellions when such occur, &c., that it was only in respect of such service that his ancestors were granted cultivable lands in Jagannadhapuram and these have accordingly been registered under that head in the permanent account of the boundaries of fields, that the grandfather, the father of Bennaya and subsequently Bennaya himself have been doing the prescribed service and enjoying the lands, that the Inam Commissioner had not settled the quit-rent on them as they had been brought under the cultivable extent with the remark that their assignment was for personal service (to the Zemindar), that out of the aforesaid twelve, four hillmen residing at Vangavaka are still rendering the prescribed service, that only eight including Bennaya have for some time previously made default, that Bennaya's father has filed the counterpart of the agreement in this respect in the Zemin office, that when the said lands were attached subsequent to the demise of Bennaya's father Bennaya appeared himself before the Zemindar and presented a petition undertaking to do with the prescribed number of men all the services his father was doing upon which the lands had to be restored to him, and filed the grants issued by the late Deputy Tahsildar as also a list prepared from the register of orders issued in proof of the uninterupted service rendered by Bennaya and his father. They (the vakils) have also conclusively proved the facts by their witnesses.

Bennaya stated that the said lands were not granted on account of service to be rendered to the Zemindar, that they have been granted at a favorable rent for past services, and that the documents with him were consumed by fire. But I could not believe his statements. Though the onus of proving that the lands have been granted at a favorable rent for past services is on him he pleads that the documents were burnt. I therefore bring these

facts to your notice and request that orders may be passed herein as you may deem fit. I have herewith forwarded the connected records with a list thereof.

(*b*) Letter from the Tahsildar of Ellore Taluq.

As directed in circular No. 4 published in the District Gazette, I beg to state as follows:

In respect of the recovery of Rs. 225-3-6, which represents the arrear up to the end of February in the villages of the Taluq, I have issued notices fixing the terms of payment as well as the demands. During the month, i. e., in March, a greater portion has been realized. The annual settlement having continued till the end of the last month, it was not possible to determine the amount payabe by each ryot; during the current month I have settled the amount individualwar and am collecting it. I have made the necessary arrangements to collect the whole arrear in the current month alone. But as some are non-resident ryots and as it is uncertain that the arrear on behalf of the Dwaraka Tirumala temple will be recovered, I am afraid if the arrear amount will be completely recovered or not. Rs. 189 pertains to the arrear due on behalf of the Dwaraka Tirumala temple; in spite of the fact that the ministrants of the temple are at present continuing in service, they express their inability (to pay the arrear) uuless the suit now pending between them and the trustee is decided in their favour. Again Rs. 28 is an objectionable item, it will not be recoverable until final orders are issued in the matter.

## 1898.

(*a*) పెద్దాపురం తహశీలుదారు గారికి యేలేశ్వరం డిప్టి తహశీలుదారు వ్రాసుకొనినయాదాస్తు.

జగపతినగరం కరణం తన గ్రామభూములకు నీరుపారుదల కాబడేకాలువ తాలూకు ప్రదేశము కొంత గెద్దనాపల్లి కాపురస్థులు ఆక్రమించుకొని కొంపలుకట్టడమువల్లనున్ను, నీరవరంముతా ప్రొప్రయిటరువారు మామూలుప్రకారం మరమ్మత్తు చేయించక పోవడము చేతనున్ను, తమభూములకు నీరు రావడం తక్కువ ఆయినదనే మొదలయిన సంగతులతో వ్రాసుకొన్న రిపోర్టు విచారణకొరకు నాతావుకు

ది 23-9-85 తారీకున రిపరు చేయించి యున్నారు. ఇదే సంగతిలో అజగపతినగరం గ్రామరహితులు అరవబుచ్చివెంకట్రాయడు వగయిరాలు నాతొవున ఒక అర్జీ కూడా దాఖలు చేసియున్నారు.

ఏలేటి మొగ మొదలుకొని గెద్దనాపల్లివరకువుండే కాలువ వీరవరం ప్రాప యిటరువారు మరమ్మతు చేయించడం విధాయకమయ్యిన్నీ, అప్రకారం జరిగించక పోవుటచేతనున్ను, గెద్దనాపల్లి కాపురస్తులయిన కోరుమిల్లి సీతన్న, సవరం అప్పడు, నందూరిపోతన్న, ముల్లేటిరాజన్న అనువారలు ఆకాలువ తాలూకు స్థలంకొంత ఆక్రమించుకొని ఆవరణచేసి అరటితోట వేసుకోవడము తుమ్మచెట్లు వగయిరాలు పాతడము మొదలయిన పనులు జరిగించియుండడమే కాకుండా సీతన్న అనేవాడు ఇల్లుకూడా కట్టియుండడము చేతనున్ను కాలువ యిరుకు మెరక అయి తమగ్రామ భూములకు అదివరకు వస్తూవుండే నీటికంటె తక్కువ రాబడుతూవున్నదని అర్జీదా ర్లలో హాజరువున్న అరవ బుచ్చివెంకట్రాయుడున్ను, యిందున అనుసరించే జగ పతినగరం గ్రామ మునసబు కరణములున్ను, వ్రాయిస్తారు.

కోరుమిల్లిసీతన్న తాను కాపురంవుండే పాక సికస్తు అయినందున అది విప్పివేసి తిరిగి రెండుమాసముల క్రిందట తాజాయిల్లు కట్టుకోవడములో కాలువ కేకి కొంతవరకు ఆక్రమణ కాబడ్డసంగతి నిజమైనట్టు ఆఖరకు ఒప్పుకొని కయిఫీ య్యతు వ్రాయించినాడు.

సవరం అప్పడు తాను అరటిమొక్కలు వగైరాలు వెయ్యబడ్డ స్థలము తన తాలూకే అయివున్నది గాని కాలువ తాలూకు కాదని వ్రాయిస్తూ నాతనిఖీకాల ముకు సదరుకాలువవద్దు పారతో తెగగొట్టినట్టు కనపడే గుర్తులు తనవల్ల నే అప్పటికి రెండుమూడు రోజులక్రిందట గలుగజెయ్యబడ్డట్టు ఒప్పుకున్నాడు

నందూరి పోతన్న తాను కాలువతాలూకు స్థలము ఆక్రమించుకోలేదని వ్రాయిస్తూ కాలువలోకి పుట్టి దిగతొక్కడముచేత ఆపుట్టి తీసి తన దడివాళ వేసు కున్నట్టు చెప్పుతాడు.

ముల్లేటి రాజన్న తాను పుట్టిదిమ్మవేసి నేపాళపు మొక్కలు వగయిరాలు పాతిన ప్రదేశము కాలువవద్దుదయినందుకు ఒప్పుకూంటూ ఆపని నాతనిఖీ కాల మునకు 5-6 రోజులకులోపుగా జరిగించి ఉన్నట్టు వ్రాయిస్తాడు.

సదరు నలుగురు ఆసామీలు ఆక్రమణ చేసినారనే దావాస్థలములు కాలువ తాలూకు కాననిన్ని, వీరవరం ముఠాప్రొప్రయిటరు వారివలన వాళ్లకు నివేశనముల క్రింద యివ్వబడ్డ స్థలములు అనిన్ని, అట్లావాళ్లకు నివేశనముల క్రింద యివ్వబడ్డ బాబతే అయినందుకు తాను యెరిగివుండడం తప్ప వేరే వ్రాత మూలమయిన ఆధారములు యేమీ లేవనిన్ని, యేలేటివద్ద ఉండే గట్టు మొదలు గెద్దనాపల్లికి నీరు ప్రవహించే కాలువ వరకు వీరవరం ముఠా ప్రొప్రయిటరు సంవత్సరమునకు ఒక పర్యాయమున్నూ జరూరును అనుసరించి అప్పుడప్పుడున్నూ మరమ్మతుల్ను చేయించడము మామూలు అనిన్ని, అదేప్రకారము ఈసంవత్సరం ఏప్రిల్ నెలలో చేయించివున్నారనిన్ని, దావాకాలువ వెంట నీరు వెళ్లడమునకు ఏవిధమయిన ఆటంకములేదనిన్ని గెద్దనాపల్లి మునసబు వ్రాస్తాడు.

ఉభయపార్టీలను వుంచుకొని ఆదావా ప్రదేశము వగయిరాలను నేను స్వయముగా చూచి ప్లాను తయారుచేసి యిందుతో జతపర్చడమైనది.

నాతనిఖీకాలములో నీరు ధారాళముగా పారుచుండుటచేత ఈసంవత్సరం కాలువ మరమ్మతు చేయలేదని జగపతినగరం గ్రామస్థులు తెలియచేసే సంగతి నేను నమ్మచాలను. ఆ ముఠా సూపరింటెండెంటుగారు వ్రాసిన పుత్తిరం యంక్లోజర్లు వగయిరాలవల్ల మరమ్మతు జరగబడ్డట్టు స్పష్టముగా కనుపడుచున్నది. నీతన్న వగయిరాలు యిళ్లువగయిరాల క్రింద కాలువ స్థలము కొంత ఆక్రమణ చేయుటచేత దానిన్ని మరమ్మతు చేయవలసి వచ్చినప్పుడు ఆపైపున మట్టివగైరాలు వడ్డుపయిని వెయ్యడమునకు వల్లలేదు. మరమ్మతుచేసే మనుష్యులు ఆభాగమందు నడవడమునకు అయినా అవకాశములేదుగనుక ఈసంగతి శృతపరుస్తూ యీబాబతు కాగితములు పెహరస్తు ప్రకారము యిందులో పంపించినాను.

(b) మహారాజశ్రీ కలెక్టరువారి సముఖమునకు.

రాజమహేంద్రవరం తహశీలుదారు వ్రాసుకొన్న అర్జీ:—

జగ్గంపేటముఠా ప్రొప్రయిటరువారు తమపేర వ్రాసుకొన్న అర్జీని పంపించి రోడ్డు క్రింద ఆక్రమణ అయిన జిరాయతి తాలూకు ముజరా కావలసినదని కోరె సొమ్మును గురించి రిపోర్టు చేయవలసినదని వ్రాయించినందుకు మనవి చేసుకొనేది యేమంటే:—

అర్జీలో వివరించిన సొమ్ము యే యే రోడ్డు క్రింద ఆక్రమణ అయినభూముల తాలూకు అయినది వారుచెప్పే సముజాయిషీని పట్టిన్ని, తాలూకాలోవుండే ఆషాబతు లెఖవల్లనున్ను చూడగా క్రిందిటి నెలలో పంపిన క్వార్టర్లీ స్టేటుమెంటు దాఖలా యెత్రసీరాతో మార్కు చేసిన మూడుపద్దులబాబతు అయినట్టు అగుపడుచున్నది సదరుభూములు కొత్తూరు రోడ్డుతాలూకుప్రక్క కాలువల క్రింద పట్టిగోతుల క్రింద ఆక్రమణ అయినవి అందులో య,1శె 14ల భూమి ఖాయం ఆక్రమణ క్రింద చేర్చబడ్డది. దాని విషయమై యిప్పుడు తకరారులేదు. తక్కిన శె10ల భూమికి రు 3-2-2 లు ముజరా కావలసినట్టు కోరుతారు. ఈభూమి తిరిగి సాగుబడిలోకి వచ్చేది గనుక లెఖలో చేరక పోవడము కలిగినది. అయినను షరాకలములో ఈసంగతి నోటుచేయబడ్డది. యీస్థితిజాహీరు నిమిత్తము విన్నపించుకున్నాను.

## Translation.

Letter from the Deputy Tahsildar of Eleswaram to the Tahsildar of Peddapuram.

The report submitted by the kurnam of Jagapathinagaram, bringing to notice among other things, that the irrigation of his lands has been to some extent diminished by reason of a portion of the (bed of the) said irrigation channel having been appropriated by the inhabitants of Geddanapalli for house-sites and of the mittadar of Veeravaram not having carried out the usual repairs, has been referred to me on 23-9-85 for report. In this very matter, Arava Buchi Venkatarayudu &c., ryots of the said Jagapathinagram have also presented a petition to me. Arava Buchi Venkatarayadu, who was present among the petitioners, stated to me that the proprietor of Veeravaram, who was bound to repair the channel from its mouth at Ellore to Geddanapalli, has not carried out the said repairs, that Korumilli Seethanna, Savaram Appadu, Nandoor Potanna and Molleti Rajanna, inhabitants of Geddanapalli, have appropriated and enclosed an extent of land pertaining to the channel whereon they set plantain trees and also planted Babul &c., trees, and in addition to these Seethanna has constructed a house thereon; that on this account the channel had become narrowed and silted up diminishing the supply of water hitherto flowing to their village,

The village munsiff and the kurnam of Jagapathinagaram have corroborated the above facts.

Korumalli Seethanna has finally made a statement admitting the truth of the fact that in the matter of renewing two months back the ruined hut in which he has been living he had encroached upon a portion of the channel land.

Savaram Appadu, who made a statement that the land whereon the plantain shoots have been laid was his, admitted that the marks of cutting at the channel bank found during my inspection to have been caused with a spade, were caused by him two or three days previously.

Nandoor Potanna averred that he had not encroached upon the channel and that he had thrown the earth removed in deepening the silted channel by the side of his fence.

Molleti Rajanna asserted that the extent which he had levelled and on which Nevalam (jasmine) shoots have been planted, formed the channel bank and that he had done so 5 or 6 days prior to my inspection.

The village munsiff of Geddanapalli stated that the sites in question alleged to have been encroached upon by the aforesaid four persons were not channel land, that they have been assigned to them as house-sites by the mittahdar of Veeravaram, that beyond being himself personally aware of the fact there was nothing in writing to prove that the plots have been assigned as house-sites, that it has been usual for the mittahdar of Veeravaram to carry out repairs annually and as occasion may arise to the channel lying between the embankment at Ellore and the mouth of the channel irrigating Geddanapalli, that repairs have accordingly been carried out during April in the current year, and that there was nothing to obstruct the flow of water in the channel in question.

I have personally inspected the land, &c., in question in the presence of both the parties and attached hereto the plan prepared (by me.)

As there was a copious flow of water during my inspection, I could not credit the allegation of the residents of Jagapathinagaram

that the channel had not been repaired this year. It is manifest from the reply with enclosures, &c., received from the Superintendent of the Mittah that the repair has been carried out. Seethanna, &c., having encroached upon the channel land, it is not possible to throw the earth on the brink at the time it was repaired. It is not even possible for those carrying on the repairs to walk on that side. With this report I submit a list of the papers connected with the matter.

Letter from the Tahsildar of Rajahmundry to the Collector.

I beg to report on the matter of the remission to be allowed for the cultivable land encroached upon for the road as stated in the petition submitted by the mittahdar of Jaggampeta which has been forwarded to me.

From the facts explained by him and on inspection of the accounts in the Taluq office in that matter to trace the road to which the amount referred to for the encroachment of lands pertains, it appears to be embraced in the three items marked in red ink in the quarterly statement forwarded last month. The said lands have been utilised for side-ditches and earth-pits for the Kothur Road. Of them, 1a 14c of land is shewn as having been permanently utilised. This matter is not at present contested. In respect of the remaining 40 cents, he states that he is to be given a remission of Rs. 3—2—2. As this extent will again be brought under cultivation it had to be excluded from the accounts. However, it was noted, I submit this state of facts which is self-manifest.

## 1899.

(*a*) మ॥ రా॥ శ్రీ కర్నూలు తాలూకా తహశ్శీలుదారిగారి సముఖానకు.

చిట్టిపాడు గ్రామ మునసబు సింగారెడ్డి వ్రాసుకొన్న రిపోర్టుయేమంటే:—

1878 సంవత్సరం మే నెల పదుకొండో తేది వుదయం షుమారు నాలుగు ఘంటల కాలమందు చీరెంచ అప్పను లచ్చన్నకొడుకు ఆదినారాయుడు వీరిద్దరున్ను గ్యాంగ యింట్లనుంచి మా గ్రామానికి వచ్చి నాదగ్గర యిచ్చిన ఫిర్యాధియేమంటే:—నిన్నటిరాత్రి షుమారు రెండు ఘంటలన్యాళ మామేస్త్రీ అయిన

కొండప్ప ఇంటికి కొందరు దొంగలు వచ్చి వాకిలు పగులకొట్టి మేస్త్రి కొండప్పను గొడ్లతో తలమీద కొట్టి యింకా కొంత దెబ్బలు కొట్టినారు. అతడు వచ్చి తమ దగ్గర ఫిర్యాదీచేసేటందుకు ఘాబరతో రాలేదు. మేమువస్తిమి అని చెప్పిరి. అ తక్షణం నేనున్ను .తలారి నాగడు, వెట్టి లచ్చిముడు, వెట్టియారడు యింకాయిద్దరు పెద్దమనుష్యులు అనగా చిన్నసామి చెంగిరప్ప వీండ్లను పిలుచుకొని సదరీగ్యాంగియిండ్లకుపోయి మేస్త్రీ కొండప్ప యింటికి పోయి విచారించగా మేస్త్రీ కొండప్ప నాదగ్గర కైఫీయతు వ్రాయించినది యేమంటే:—పదోతేది శుక్రవారం రాత్రి నేను తలవాకిలి తెరుచుకొని వాకిలు లోతట్టు మంచము వేసుకొని పండుకొని యుండగా షుమారు వొంటిగంటవ్యాళ కొంత దొంగలువచ్చి నా యింట్లోకిరాళ్లుయిసిరికొట్టిరి. అందులో వకరాయి యడమ మోచెయ్యికి దెబ్బ తగిలినందున నేనున్ను నా భార్యయున్ను గోడచాటున దాచుకొంటిమి. తిరుగా నేను వాకిలి దగ్గర చూడవలెనని రాగా వకపొడుగాటిమనిషి గొడ్లితో తిప్పి కంటి పైనకొట్టినాడు. గనుక కంటిమీద ఘాయము అయినది. అంతలోనే నాయింటి లోపలికి పారిపోతిని. తిరుగా రాళ్లు నా యింటిలోపలికి విసిరి తర్వాత నా తలవాకిలి వాండ్లేమూచుకొని బైటచిలకం వేశిరి. నేను లోపలిగడ వేసుకొన్నాను. తర్వాత బైటికి రమ్మని పిలిచిరిగాని నేను బైటికిరాలేదు, పిమ్మట తలవాకిలి గడ్డపారతో మద్దెమంచు విరగకొట్టి సొమ్ము తెమ్మని అడిగిరి. అప్పట్లో నేను ఘాబరాపడి నా భార్యనడుమున ఉండే వెండిడాబు, చేతిలోనిఉండే 2 వెండిఘట్టి కడియాలు, 2 బంగారు బెండు కమ్మలు, ఏకపొడుగాటి మనిషి చేతికి నేనుతీసి ఖండిలోనుంచి యిచ్చినాను. సదరీ పొడుగాటిమనిషిని గుర్తు తెలియదు. తరువాత వాకిలు తీయుమని చెప్పినాడు, అప్పుడు వాకిలు తీసినంతలోనే నన్ను కొడగల్లాయి అనేవాడు బైటికీ సిగపట్టుకొని యీడ్చి నాతల రొంటికలు పట్టుకొని నేలమీద పడవేసి నూలుపగ్గముతో నా కాళ్లుకట్టినాడు. మిగత వాండ్లందరున్ను నన్ను కొట్టినారు. అప్పట్లో కొట్టినవాండ్లను గుర్తించినాను, వాండ్లు తిరుగా నా యింట్లో చొరబడి నా పెట్టెలో ఉండిన రూ 130 లన్ను 1 నల్లకంబడి 1 పచ్చడం 2 తెల్లరుమాలు 8 దోత్రాలు 1 యర్రధోత్రం 2 అంగరఖాలు 1 జంబుఖానం 1 కొడగత్తి 3 డబిల్ గిగ్గునిల్ 3 గడ్డపారాలు 2 ఫికాశీలు 2 యిసతెట్లు నా భార్యయొక్క 1 ముత్యపు ముక్కర 1 బేసరి 2 వెండి పిల్లెండు 1 రెట్ట టొల్లు కడియం యిదిగాక నాది 1 వెండిసిరిగ 1 కాలుమెట్లు చెవులోని బంగారుగుండెలు 2 న్ను తక్కొన్నారు. యీసా

మానులు తీసుకొని పోయే టప్పుడు నన్ను తిరుగ యింట్లోవేసి వాకిలుమూశి తాడుతో చిలక ముకట్టి వెళ్లిపోయినారు. వాండ్లు వెళ్లిపోయినతర్వాత వాకిలి కండిలోనుంచి తాడుతోకట్టినది యిప్పుకొనీ వెలపటికి వచ్చిచూడగా మా గ్యాంగి యొనిమిది యిండ్లకు వాకిలి మూశి మెండుకొట్టివుండిరి. నేను ప్రతియింటికి మెండును తీసినాను అప్పుడు వాండ్లు గలభచేశి అందరు నన్ను చుట్టుకొని యేడ్వసాగిరి. అంతలో నేను చిట్టిపాడుకు పోయి రెడ్డిగారిని పిలుచుకొని రమ్మని చీరంచ అప్పడిని ఆదినారాయుడిని వీండ్లను పంపింతిని అని వ్రాయించినాడు నేను సదరీ గ్యాంగియిండ్లను చూచి బైట పారవేశిన రెండు ఉత్తపెట్టెలను తీయించుకొని గ్రామానికి వచ్చి నేరస్తులును పత్తాపెట్టి అందులో బోయుం గంగిగాడు 1 మాదిగ పాలెడు 1 అనుముని కొడుకు దుకగడు 1 మాదిగ యెఱ్ఱడు 1 మాదిగ కెంచని తమ్ముడు చింగడు వీండ్లు దొరికినారు. సదరీ పుత్తరెండుపెట్టెలను సదరీ దొరికిన 6 గురు ఆసామీలను గ్రామంచానడిలో హాజరుపరచివాను. మిగుల వాండ్లు గ్రామంలోహాజరులేరు. ఉన్నసంగతి తమ చిత్తానకు వ్రాసుకొన్నాను. చిత్తగించగల కర్తలు.

(b) మహారాజశ్రీ విశాఖపట్నం డిస్ట్రిక్టు మునసబు కోర్టువారి సముఖానకు.

అసలు $\frac{299}{75}$

వాది-కోటప్ప కోట చిన్నవెంకట్రెడ్డి.

ప్రతివాది-గుండ్లపాడు రామదాసు.

ప్రతివాది శివిల్ కోడ్డు తా॥ శె॥ 110 ప్రకారం ధాఖలు చేశిన కయిఫీతు:

(1) వాది దాకలుచేశిన ప్లానులో కనపర్చిన డి॥ మార్కు భూమియొక్క పేనూజీ కలాలుఖావాగుమాస్తాఅయిన పట్టన్నకుహక్కుఅయి అతనియొక్కయు అతని వారసుల యొక్కయు అనుభవములో వుంటూ వున్నదిగాని కొద్ద ఏ-బి-సి-మార్కుల భూమి సదరు పట్టన్నయొక్కగాని అతని వారసులయొక్కగాని హక్కులు వారి స్వాధీనానుభవంలో యెన్నడూ వుండివుండలేదు.

(2) అందువల్ల సదరు ఏ-బి-సి మార్కుల భూమిని పట్టన్నవగయిరాలు అమ్ముటకుగాని ఈ వాది మాసుకొటకుగాని యంతమాత్రం హక్కులేదు.

(3) సదరు (ఏ) మార్కు స్థలమును యిప్పటికి సుమారు 60 లేక 70 సంవత్సరముల క్రిందట ప్రతివాది మామయిన పేడు జగ్గయ్యయొక్క తండ్రి వీరయ్య సంపాదించి అందులో ఉన్న యిల్లుకట్టి అది లగాయతు అతనున్నూ ఆతని అనంతరం సదరు జగ్గయ్యయున్ను వాటిని తమస్వాధీనం నుంచుకొని అనుభవిస్తూ ఉన్నారు.

(4) వాటిని వ్రాసిన హేతువులచే వాది మామగారికిగాని వాదికిగాని సదరు (ఏ) మార్కు స్థలం యెన్నడూ స్వాధీనమయి అనుభవము కాలేదు.

(5) యీ ప్రతివాదికి యిప్పటికి సుమారు 20 సంవత్సరములు అయినది సదరు జగ్గయ్య తన కూతురిని యిచ్చి వివాహంచేశి సదరు (ఏ) మార్కు స్థలములో అతనితోపాటు యీ ప్రతివాదిని కాపురము ఉంచినందున యీ 20 సంవత్సరముల నుంచి సదరు జగ్గయ్యతోపాటు సదరు (ఏ) మార్కు స్థలమును ప్రతివాది తనస్వాధీనానుభవంలో ఉంచుకొన్నాడుగాని ప్లయింటులో చెప్పిన అద్దెచీటిని పురస్కరించుకొని అతను అందులో ఉండలేదు.

(6) అయితే సదరు స్థలమును అక్రమముగా హరించడపు దురుద్దేశ్యముతో సదరు జగ్గయ్య యింటి యొద్ద హాజరులేని సమయమందు వాదితరపున మనుష్యులు వచ్చి ప్రతివాది తాలూకు యిల్లువిప్పివేయడము మొదలయిన తొందరలు కలుగచేస్తామని భయపెట్టి సదరు స్థలముయొక్క పూర్వోత్తరము బాగా తెలియనటువంటిన్ని చదువు బాగా లేనివాడయి నటువంటిన్ని ప్రతివాదిచేత వాది తాలూకు సదరు మనుష్యులు తమకు తోచినట్లు దావా అద్దె చీటిని వ్రాయించుకొన్నారుగాని అది యంతమాత్రము నిజమయినదిన్ని చెల్లతగ్గదిన్ని కాదు. సదరు అద్దెచీటినిపట్టి యేవిధమయిన బాధ్యతయున్నూ యెంతమాత్రము ప్రతివాదికి లేదు. అందువల్ల వాదికి యే విధమయిన హక్కున్ను కలుగనేరదు.

గనుక విమర్శించి దావా ఖర్చులుతో పరిహరించి ప్రతివాది ఖర్చులు వాదివల్ల యిప్పించవలెనని ప్రతివాది కోరుచున్నాడు. చిత్తగించవలెను.

## Translation.

The report submitted by Singa Reddi, the Village munsiff of Chittipadu, to the Tahsildar of Kurnool.

At about 4 A. M., on the 11th May 1878, Cheeranda Appadu and Adinarayadu, son of Achanna, came to the village from the gang-houses and complained to me as follows:—

Last night at about 2 A. M. some robbers broke open the door of the house of gang-maistry Kondappa, struck him on the head with a hatchet and dealt him some blows. Having been terrorised he did not go to you to complain, and we have come (for the purpose). Immediately, I went to the said gang-houses with Talayari Nagadu, Vettis Luchmudu and Veeradu, and with two respectable men Chinnasami and Chendrappa, and maistry Kondappa made (to me) a statement at his house; to the following effect: " On the night of Friday, the 10th instant, I had the street door of my house open and laid myself on a cot in the inner pial; at about 1 o' clock, some thieves pelt stones into my house. One of the stones struck me at the left elbow and I and my wife hid ourselves behind the wall. When I again came to the front door to peep out, a tall man brandished a hatchet and struck me on the eye. I was therefore wounded in the eye. I then ran into the house. After again pelting stones into my house, they themselves chained the door which I had bolted from inside. Though I was theraefter asked to come out, I did not stir. They then broke the house-door in the middle with a crowbar and asked me to deliver the property. I then became frightened, and handed through a crevice to the tall man the silver belt from the waist of my wife, two silver (solid) bangles. two gold earrings. I could not identify the said tall man. They then asked me to open the house-door. When I opened the door, Codagallayi dragged me out by the tuft, threw me on the ground, and tied my legs with a cotton rope. All the others struck me. I identified those who then struck me. They re-entered my house and took away from my box cash Rs. 130, 1 black blanket, 1 cloak (warm covering), 2 white turbans, 9 lower garments, 1 red lower garment, 2 jackets, 1 cotton carpet, 1 bill hook, 3 detonators, 3 crow bars, 3 pick axes, 2 iron buckets, as well as a nosering strung with a pearl, I ring worn in the right nostril, 2 silver కడగ, 1 toe ring, 2 gold rings in the ears. When they were carrying away these properties, they put me into the house, chained the door outside and fastened it with a rope and went away. After they dispersed, I had the rope untied

through the hole in the door and from the street found that the eight gang-houses had their doors closed and plugged outside. I removed the plug at every house. The inmates thereof then raised an uproar and began to weep around me. In the meanwhile I sent Cheerancha Appadu and Adinarayadu to go to Chittipadu and bring the Village munsiff," I inspected the said gang-houses and secured the two empty boxes thrown out; at the village, obtained clue regarding the accused and brought five of them with the two boxes to the village Chavadi. They are—1 Boyam Gangadu, 2 Madiga Paledu, 3 Duragadu son of Anumadu, 4 Madiga Erradu, 5 Chingadu, younger brother of Madiga Kenchadu. The rest are absent from the village. I have reported the facts for your concideration. Please to consider them.

(b)

In the Court of the District Munsiff of Vizagapatam.

O. S. No. 299 of 1875.

Kotappakota Chinna Venkata Reddi—Plaintiff

against

Gundlapadu Ramdoss—Defendant.

The written statement of the defendand filed under Sec. 110 of the Code of Civil Procedure.

(1) In the plan filed by the plaintifl, the title of Pattanna, the gumastah of the late arrack vendor, attaches only to the land marked D therein and it has been in the enjoyment of the said Pattanna and his heirs; while Pattanna and his heirs have no title to the other portions marked A, B and C, as these have never been in their possession and enjoyment.

(2) Neither Pattanna, &c., have therefore any manner of right to convey the said portion marked A, B and C nor the plaintiff to give up the same.

(3) About 60 or 70 years heretofore, Veerayya, the father of Pedu Jaggayya, uncle to the defendant, acquired the said plot marked A and constructed the house standing thereon, and ever since, he and after him, the said Jaggayya, have been in the possession and enjoyment thereof.

(4) For the reasons stated above, it never came into the possession and enjoyment of the plaintiff's uncle or the plaintiff.

(5) The said Jaggayya had his daughter married to the defendant twenty years heretofore, and allowed him to live with him in the portion marked A; the defendant had therefore been in possession of the said portion marked A for the past 20 years, and has not been there in virtue of the rental agreement as alleged in the plaint.

(6) The men on behalf of the plaintiff came to the house of the said Jaggayya during his absence and with the ulterior intention of coming by the said land illegally, threatened the defendant, who was not fully aware of the particulars of the matter and not also literate, that they would unroof the house and cause other damage, and thereby coerced him to execute the rental agreement in question in the manner they desired, and as such the said deed is neither genuine nor valid. The defendant is in no manner liable by reason of the aforesaid rental agreement. No title will thereby accrue to the plaintiff.

The defendant, therefore, prays that the suit may be tried and dismissed with costs, and that the plaintiff may be directed to reimburse the costs of the defendant. Please to consider the matter.

## 1899.

1. పిప్పళ్ల పాపాశాస్త్రులు బావగారికి తమ బావమరిది రాముడు వ్రాసుకొన్న దేమంటే: రామయ్యపల్లెలో ఉండే మనప్రభయుః మాన్యములను కరణమువాడు కొలిపించి, ఆమాన్యాలకు 8 రూపాయలు యిచ్చేటట్టయితే మీకు యీసంవత్సరానికి నడిపిస్తాను, లేకపోతే లేదని తొందరచేసి మామసలాయనచేత నాలుగురూపాయలు తీసుకొన్నాడు. ఈసారివర్షము వెనకచిక్కికురిసి అతిశయమై వొకచేను జొన్నపంట బొత్తిగా పోయినది; ఒకచేను మాత్రము కొంచము బాగావున్నది. గనుక ఆవూళ్లో ఉండడానకు మనస్సులేక బద్వేలిలోచేరి కొంతమంది బుద్ధివిని ఆత్మకూరి వెంకట్రాముడు అనేవానిది ముత్తుము కయ్యనున్ను, యింకా తూమెడున్నిరసపట్టా పొలమున్ను, మనశేద్యాన సాగించినాను. నేనుబళ్లారికి వచ్చేటప్పుడు పయిరుపొట్ట కరుకుతో ఉన్నది మనము ఆ పొలానికి యేటా 20 రూపాయలు

యిచ్చినట్టయితే నాలుగుపుట్లవడ్లు వస్తవి. ఇదిగాక ఉప్పలపాటి సమాచారమేమంటే; మీరు వచ్చిన తక్షణము చిన్నవాడి ప్రయోజనము జరిపిస్తామని మనవారు చెప్పినారు. మీరు పోయినప్పటినుంచి యీదినమువరకు గుడిగుంటవద్దవుండే మీ ఖండ్రికలో మనకు దుడ్డురాలేదు.

2. నవుఖరీభూములు రాబట్టేనిమిత్తము దావాలు తెచ్చేవారు సాధారణముగా జమీందారులును మొఖాసాదారులును గొప్ప యినాముదారులును అయియుందురు. వీరు నవుకరులకు సాధారణముగా భూములను ఇచ్చేటప్పుడు కట్టుబడి అనే పన్నుకూడ విధించి భూముల నిచ్చుచుందురు. ఇటువంటి దావాలలో దావాభూములు తమహక్కు అయిన భూములనిన్ని, తమ పూర్వులు ప్రతివాది పూర్వులకు దావాభూములను నవుకరీ షరతుపైని యిచ్చియున్నారనిన్ని, ప్రతివాది తనకు విధ్యుక్తమయిన నవుకరీ చేసుకొనుచు కట్టుబడి చెల్లించేవాడనిన్ని, ప్రతివాది నవుకరీ తమకు జరూరులేదనిన్ని, భూమిని విడిచిపెట్టవలసినదని నోటీసు ఇస్తే భూమిని విడువక తమయొక్క హక్కునుకూడ ప్రతివాది నిరాకరించినాడనిన్ని, వాదులు వాదించెదరు. ప్రతివాదులు ఆన్సరు దాఖలుచేయడములో దావాభూములు వాదుల పూర్వులవల్ల తమ పూర్వులకు సర్వ మొఖాసాగా యియ్యబడినవనిన్ని, నవుకరి యెన్నడూ చేయలేదనిన్ని, చిరకాలమునుంచి దావాభూములను నిరాటంకముగానున్ను స్వేచ్ఛగానున్ను అనుభవించుచున్నామనిన్ని చిరకాల అనుభవమువల్ల వాదులదావాకు కాలదోషము ఆశ్రయించినదనిన్ని, వాదులు తమకు క్రమమైన నోటీసు యియ్యలేదనిన్ని, వాదించెదరు. దావాభూములు వాదిపూర్వులవల్ల ప్రతివాదిపూర్వులకు నవుకరీషరతుపైని యియ్యబడినవా అనే ప్రశ్నను తీరుమానించుటకు పట్టా సాక్ష్యముగా ఫయిలుఅగుటకు అవకాశములేనపుడు, జమీందారిలోనుండు చిఠాలు, ఆవర్జా పుస్తకములు, రసీదు పుస్తకములు, ఇరసాలునామాలు వాదులతరపు సాక్ష్యముగా దాఖలు కావలెను. ఇరసాలు నామాలలో కట్టుబడిపైకము చెల్లినపుడు చలానావలె ఒక మిమో నవుకరులు సొమ్ముతో జమీందార్లకు తమ సంతకములతో దాఖలు చేయుదురు. దావాకు కాలదోషము ఆశ్రయించినదా అను సారాంశమును తీరుమానించుటలో, ప్రతివాది యొక్క అనుభవము లిమిటేషను ఆక్టు తాలూకు 2 వ షెడ్యూలు 144 వ ఆర్టికలులో చెప్పబడిన ప్రకారము వ్యతిరేకానుభవము కానియెడల వాదిహక్కు నశింపుకావడముగాని, ప్రతివాదికి హక్కు కలగడముగాని జరగదని నిర్ధారణ చేయబ

డును. దావాసొత్తు ప్రతివాది 12 సంవత్సరములకు పయికాలము అనుభవించిన మాత్రమే ఆ అనుభవము వాదికి వ్యతిరేకానుభవ మనిపించుకొనతగదు. వాది హక్కు నిరాకరించుచు తాను దావాభూమిని అనుభవించుచున్నట్లున్ను, ఇట్లు నిరాకరించి అనుభవించుచున్న సంగతి దావాకు పూర్వము 12 సంవత్సరముల పయి కాలముకిందట వాదికి తెలిసినట్లున్ను, ప్రతివాది తెలియపరచినయడల ప్రతివాది యొక్క అనుభవము వ్యతిరేకానుభవ మనిపించుకొబడును. ఈ నిబంధనకులోబడి వ్యతిరేకానుభవము 12 సంవత్సరములకు పయికాలము ప్రతివాది రుజూపరచిన యెడల వాది దావాకు కాలదోష మాశ్రయించును.

3. కాపువాండ్లు తమ పశువులకు ఉపయోగములేని తక్కువయగు మేతను, ముఱిగిపోయిన నీళ్లను పెట్టుటవలన, యవి దినదినము క్షీణించుచూ బలహీనతజెంది శీఘ్రము చనిపోవును. మఱియు అవిమేయుటకై యేర్పడి యుండు బయళ్లనుకూడ తాము పైరుజేయుటకై యుపయోగించుకొందురు. ఇట్లు పశువులమేతకుగా నేర్పడి యుండు నేలల నాక్రమించుకొనుటకన్న తాము జనులు కాపురము లేని ప్రదేశములకు కాపురము చేరుటయైనను, లేక వేరు వృత్తులలో ప్రవేశించుటయైనను ధర్మమగును. పైరుజేయుటకు తమకు ముందు తమ పశ్వాదులకు మంచి యాహారమును జేర్చి పెట్టుకొనవలసినది యావశ్యకము. వాటిసంతతి యభివృద్ధి జెందవలయునను దలంపుండినయెడల వాటికి తక్కువకాని మంచియాహారము బెట్టుటయు, వాటికి వాసయోగ్యమగు కొట్టములు గట్టుటయు, వాటిని వాన చలి యెండలనుంచి రక్షించుటయు ముఖ్యమైన యంశములు. ఎండకాలమున పలుతూరులును, ఇతరకాలములయందు దినము రెండు తూరులకు తగ్గకుండునట్లు తగుమైన నీళ్లు చూపించవలయును. ముఱిగిపోయిన నీళ్లుగల తొట్లలోను, అపరిశుద్ధమగు నీళ్లుగల చిన్నగుంటలలోను గొడ్లకు నీళ్లు చూపించుట వలన వాటికి యంటు రోగములు సంభవించును. సంవత్సరమంతయు ఒక్కతీరుననే వాటికి మేతవేయు కొరకు కసువు మొదలగువాటిని విశేషముగా యగుపడు కాలములోనే జేర్చిపెట్టు కొనవలయును. ఎప్పుడు నొకేమితమైన యాహారము నిచ్చుటవలన వాటిజీర్ణకోశములు సరియైన స్థితిలో యుండి వాటికిరోగము లేవియును రాజాలవు. వాటి మేతకై యుపయోగింపబడు కసువు పచ్చిక మొదలైనవి యశుద్ధముగాయైనను నిస్సారముగాయైనను ఉండినయెడల అట్టిమేతవలన వాటికి రోగము దప్పక కలుగును. తనసును తనకుటుంబమునకును చాలునంతటి తగుమైన యాహారమును సంపాదించను

సామర్థ్యములేని కాపువాడు తన పశ్వాదులను చక్కగా కాపాడుచు వచ్చుననుట నమ్మదగినదికాదు.

4. కడప రెండవతరగతి మేజస్ట్రీటు ఫయిలు 1881వ సం॥ నెం 63 మొకద్దమాలో ముద్దయిని విడుదలచేసినట్టు చేసిన తీర్పుమీద క్రిమినల్ ప్రొసీడరుకోడు 272శెక్షన్ ప్రకారము చేసుకొన్న అప్పీలు. ఈ అప్పీలు విచారణకు వచ్చినందున, యీ కోర్టు ఉత్తర్వును అనుసరించి పంపించబడ్డ రికార్డు ప్రొసీడింగ్సునున్ను అప్పీలు పిటీషనున్ను చిత్తగించి, అప్పీలు వాది చెప్పుకొన్న హేతువులను విని 1880వసం॥ ఆగస్టునెల తే 31 దిన కోర్టువారు యీ క్రింద తీర్పును యిచ్చిరి. ఈ కేసులో ముద్దయి స్వాధీనములో 25 శేర్ల మట్టిఉప్పు ఉండెను. ఆమట్టి ఉప్పును రెండు సంవత్సరముల కిందట ముద్దయి తన పశువులకోసరము కొన్నట్టు సమాధానము చెప్పినాడు. వాడు అంత అధికముగా శేఖరించిపెట్టినందుకు కారణము కనుపడలేదు. తగుమయిన కారణములేకనే అంత విశేష పరిమాణమును తన స్వాధీనములో పూరక ఉంచుకోవడమువల్ల శిస్తు యెగవేయవలయునను తలంపు ముద్దయికి గలిగియున్నట్టు వూహించుటకు అవకాశమున్నదని మాకుతోచుచున్నది. ఆతలంపుతో ఆప్రకారము స్వాధీనములో ఉంచుకోవడమనునది. 1875-వ సంవత్సరపు 2వ శాసనప్రకారము నేరముగా ఉండెను. ప్రస్తాపపు ఉప్పును తానుకొన్నట్టు ముద్దయి యొకరారుపడెను గనుక వాడు సదరుప్రకారము న్యాయవిరుద్ధముగాకొన్నట్టు మేము అభిప్రాయపడుచున్నాము. ఇది 1805వ సంవత్సరపు 1టో రిగ్యులేషను ప్రకారము శిక్షించబడతగిన నేరమయి వున్నది. సర్కారు తరపునగాని లేక సర్కారువారు స్పష్టముగా ఉత్తర్వు యిస్తేనేగాని ఉప్పు విక్రయించ కూడదని సదరు రిగ్యులేషనులో స్పష్టముగా నిషేధించబడియున్నది. శిస్తు యెగవేయవలయునను తలంపుతోటి మట్టిఉప్పును ముద్దయి స్వాధీనములో వుంచుకొన్నట్టు ముద్దయిమీందు మేము నేరస్థాపన చేసి వానికి కోర్టువారు పదిరూపాయలు జులుమానా విధించుచున్నారు.

## Translation.

1. To my honored brother-in-law Pippela Papa Sastrulu, Your wife's brother Ramadu writes as follows: The village accountant has taken a measurement of our inam lands at Ramayapalli, and he says that, if we pay (him) rupees eight he will leave it in our hands for this year and not otherwise. So he has extracted four rupees

from the old man. This time the rains have been late. When it rained excessively one field of great millet was entirely destroyed; one field alone is thriving tolerably well. I was not, therefore, willing to remain there and went to Badvel, where I heeded to the advice of some people and took three bushels of Atmakuri Venkatrama's land and one bushel and a half of puttah land. These have been cultivated. At the time I arrived in Bellary the crop was coming into ear. If we should give twenty rupees a year for this land, we should get four puttis (bushels) of grain. Now as to the news of Uppalapadu, our kinsmen say that, as soon as you arrive, they will perform the marriage for the boy. From the day you went away, we have not received one farthing from the farm near the temple well.

2. Those who institute suits for the recovery of the possession of service inams are usually zemindars, Mokhasadars and large inamdars. When they usually assign lands for service, the lands are assigned with quit-rent also imposed upon them. In such suits the plaintiffs contend that the title to the land vests in them, their ancestors have assigned the lands in question to the defendants' ancestors on condition of (the latter) performing service (to the former), that the defendant was bound to perform the prescribed service and pay the quit-rent, that they do not stand in need of the defendants' service and that when served with a notice to deliver possession of the land the defendant failed to do so and even questioned their title (thereto). The defendants, in filing their written statement, urge that the plaint lands have been assigned to their ancestors by the plaintiff's ancestors free of rent, that no service was ever performed, that from a long time they have been enjoying the lands in question unrestrainedly and freely, that by reason of their immemorial enjoyment the plaintiffs' suit is barred by limitation and that the plaintiffs have not served them with a proper notice. When it is not feasible to file the puttah in evidence to determine the question whether the lands have been granted by the plaintiffs' ancestors to the defendants' ancestors for personal service, the cultivation accounts, the abstract accounts, the receipt books and the remittance lists of the Zemin should be filed in evidence. When the quit-rent is remitted in the remittance lists, a memo similar to the 'challan'

is presented with the amount by those who perform the service and signed by them. In determining the issue as to the limitation applicable for the suit, if the defendants' possession be not adverse as mentioned in article 144 of the second schedule to the Limitation Act, it will be determined that neither the plaintiffs' right could lapse nor the defendant's right accrue. The mere possession for 12 years by the defendant of the property in question will not make it adverse to that of the plaintiff. The defendant's possession will become adverse if it be proved by him that he had been in possession of the said land in defeasance of the plaintiffs' title thereto and that such possession in defeasance was known to the plaintiff for over 12 years prior to the date of the suit. The plaintiff's suit will be barred by limitation if the defendant proves his adverse possession for over 12 years subject to this condition.

3. By reason of the farmers supplying their cattle with an unavailing inferior fodder and putrid water, they become emaciated day by day and get weaker and soon die away. They utilise for cultivation even the meadows set apart for the cattle to graze. In lieu of thus appropriating the lands allotted for grazing cattle, it would be proper for them to inhabit uninhabited localities or to resort to other professions. It is essential that agriculturists should first secure a store of good fodder for their cattle. If it be aimed at to improve their breed, the important factors will be to provide them with sufficient and good fodder, to construct habitable sheds to stable them, and protect them from rain and cold. They should be sufficiently watered repeatedly during summer and not less than twice daily during the other seasons. They will be liable to contagious diseases if watered from the buckets containing putrid water and in ponds containing unclean water. In order to uniformly feed them throughout the year, straw, &c., must be collected when such is much available. By feeding them uniformly and moderately, their digestive organs are kept in order and they would not become affected with contagious diseases. If the straw, grass, &c., used for their fodder, be unclean and pithless, the cattle will unfailingly be affected with disease by such fodder. It is incredible that a cultivator, who has no skill to procure sufficient and proper nourishment for his family and himself, can well maintain his cattle.

4. Appeal under sec. *222* of the Code of the Criminal Procedure against the judgment of acquittal passed on the accused in case No. 63 of 1880 on the file of the Second Class Magistrate of Cuddapah.

This appeal coming on for hearing, upon perusing the petition of appeal and the record of the proceedings submittted in accordance with the order of this court, and upon hearing the arguments of the appellant, the court delivered the following judgment dated 31st August 1880:—In this case 25 seers of earth-salt were found in the possession of the accused. His explanation was that he had bought it two years before for his cattle. It does not appear why he laid in so large a supply and we think that the mere possession of such a large quantity without sufficient explanation would give rise to the presumption that there was an intention on the part of the accused to defraud the revenue. Such possession with that intention was an offence under Act II of 1818. The accused admitted that he had purchased the salt in question, and we find that he thus purchased it in an illicit manner, an offence punishable under Regulation 1 of 1805. Section 3 of that Regulation expressly prohibits the sale of salt except on behalf of Government or with their express sanction. We convict the accused of the possession of earth-salt with the intention of defrauding the revenue and the court fines him 10 rupees.

## 1911.

నేలటూరు గ్రామంలో మాగాణి నె 264 రు రు 29-6-0 లు శిస్తుగల య 5-34 ట్లు భూమికి ఆ 1876 జూలై నెల తే 11 ది్న నెల్లూరు తాలూకా తహశ్శీలు దారువారి తావున దరఖాస్తు దాఖలు చేసి వుండగా, 2 ఫసలీలు గతించినప్పటికి మంజూరులోకి రాకుండా సాగుబడికాలం తప్పిపోయినపిదప 1879 వ సం॥ మార్చి తే 3 ది్న తహశ్శీలు దారు దరఖాస్తు మంజూరు చేసినందున, ఖామందుల వారు మార్చి తే 18 ది్న సునామణి కాలమందు బీడుశిస్తుకట్టివున్నారు. కాబట్టి మనవి వ్రాసుకొనేదేమంటే: ఈభూమి సాగుబడి చెయ్యడమునకు సకాలములో మంజూరు చేసి భూమి స్వాధీనంచెయ్యక 1879 వ సం॥ యేప్రిలు నెల తే 1 ది్న భూమి స్వాధీనం చెయ్యడమున్ను, 2, 3 సంవత్సరములనుంచి క్షామంవల్ల జీవనం చెయ్యడమునకు శక్తిలేక వుండే వాణ్ని, యిటువంటి నాకు అన్యాయంగా బీడుదండగ శిస్తు అచ్చుకోవడమునకు శక్తిలేక వున్నవాడ్ని గనుక కటాక్షించి యిందుతో దాఖలుచేసు

కొన్న యే గుర్తుఫారం ఖామందులవారు చిత్తగించి భూమికి కట్టబడిన బీటిశిస్తు రు 29-6-0 లు శిస్తు తోసివేయించి రక్షించవలసినది. లేదా శిస్తు తోసివేయించని యెడల యీ భూమి నాపేర పట్టాలోనుంచి తొలగించ గలందులకున్ను కూడా ప్రార్థిస్తున్నాను.

1859 వ సం॥ ది 9 ఆగష్టు తారిఖున నె 612 న్ను దయచేయించిన హుకుం ప్రకారం పులవర్తి వెంకట సుబ్బారాయుడు తాలూకు జగన్నాయకుల పాలెంలో కాలువఘుట్ల క్రింద పడ్డ యీనాం భూమికి పిరాయింపు రావలసిన భూమినిగురించి పులవర్తి వెంకన్న వగయిరాలకు తమ హుకుంప్రకారం యిదివరలో పాయింపు చేసివున్న భూమిలో సదరు వెంకటసుబ్బారాయుడికి యెంతభూమి రావలసివున్నదో అంతభూమి ఆ బా॥ భూమిలో వెంకటసుబ్బారాయుడికి పాయింపు చేసి అందుల మసాతు జాపితావగయిరాలు పంపించవలసినదని డ్రాయింగు సమతుదారు పోతరాజు అక్కయ్య వృత్తాంతం వ్రాసి వున్నందున, అర్జిదారు అయిన సదరు వెంకటసుబ్బరాయుడుతాలూకు కాలువఘుట్ల క్రింద పడ్డ భూమి మసాతుచేసి అందుకు పిరాయింపు రావలసిన భూమి దామాషాయి ప్రకారం వెంకన్న వగయిరా యీనాందార్లకు పాయింపుచేయగలందులకు 1266-వ ఫసలీలో సెలవుఆయివున్న భూమిలో యలు 0-7-0 ట్లు భూమిన్ని సదరు వెంకట సుబ్బరాయుడికి పాయింపుచేసి, ఆ సమతుదారు అందుల మసాతు జాపితా పంపించినందున సదరు మసాతు జాపితా యిందుతో పంపించుకొంటిని. దాఖలు చిత్తగించ కర్తలు.

మరిన్ని సుబ్బరాయుడు తాలూకు కాల్వల ఘుట్లక్రింద పడ్డ భూమికి రావలసినది స్న 1263 ఫసలీలగాయతు స్న 1265 ఫసలీవరకు ఫసలీ 1 కి రు 4-1-6 లు చొప్పున రు 12-4-6 లున్ను, హుజారులో వెంకన్న వగయరాల తాలూకు యిప్పించవలసివున్న సొమ్ములోనుంచి 1266 ఫసలీలగాయతు 1268 ఫసలీవరకు ఫసలీ 1 కి రు 4-1-6ల చొప్పున రు 12-4-6 లున్ను, యిప్పుడు పాయింపుచేసిన భూమి తాలూకు సొమ్ము పులవర్తి వెంకన్న వల్ల వెంకటసుబ్బరాయుడుకు యిప్పించవలసి వున్నదనే సంగతులతో జగన్నాయకులపాలెం గ్రామ మునసబు కరణము పెత్తినదార్లు వ్రాయించి దాఖలుచేసిన కయిఫియ్యతు యిందుతో పంపించుకొంటిమి; దాఖలు చిత్తగించి వెంకన్న వగయిరాలకు యిప్పించవలసిన బా॥ హుజారులో నిల్వవున్న సొమ్ములో రు 12-4-6లున్ను వెంకన్న భుక్తములో వుండి యిప్పుడు

హుకుం ప్రకారం పాయింపు చేసివున్న భూమి బా॥ 3 ఫసలీల తాలూకు రు 12-4-10 ఋన్ను జూమలా రు 24-9-4 లున్ను పులవర్తి వెంకటసుబ్బరాయుడికి దయ చేయించడమును గురించి ఖామందుల వారిచిత్తవృత్తి ప్రకారం జరిగించగలందులకు ప్రార్థిస్తున్నాను.

కాట్రగడ గ్రామములో మాసమిష్టిని కరిణీకం యీనాంవున్నది. సదరు గ్రామ కరిణీకం మాఅన్న నిత్యానందు పట్నాయుడు సదరు గ్రామంతాలూకు నగరురుసుములు అనుభవిస్తూ నౌఖరీచేయుటకున్ను సదరు యినాం సోదరులము నలుగురము అనుభ విస్తూ వుండుటకున్ను మాలో మేము లోగడ యేర్పాటు చేసుకొనియున్నాము. ఇట్లుండగా యీనాం డిప్యూటీ కలెక్టరు నారు యీనాములు పైసలాయతీ చేయు టకు పర్లాకిమిడి దయచేసినప్పుడు గ్రామకరణాలకు స్టేటుమెంట్లు దాఖలుచేయుటకు ఆర్డరుచేసినందున సదరు కాట్రగడ గ్రామము తాలూకు యినాం స్టేటుమెంటు మా అన్న నిత్యానందు పట్నాయుడు దాఖలుచేసినప్పుడు అనుభవదారు కలంలో మా పేర్లువ్రాసి ఒక నకలు మాకుకనపర్చి అసలు స్టేటుమెంటులో మాసోదరులు ముగ్గురు పేర్లు తగ్గించి దాఖలు చేసివున్నాడు. ఆసంగతి మాకీసరికైనా తెలియకుండా వుం డెను. యిప్పుడు సదరు స్టేటుమెంటు తాలూకు పబ్లికు నకలు తెప్పించిచూడగా మాపేర్లు తగ్గించి తన పేరువ్రాసి దాఖలుచేసి మాపట్ల చాలాఅన్యాయం జరిగించి యున్నాడు. సదరు యినాం మాసమిష్టి అనుభవ మవుతూవున్నది. కాబట్టి ప్రభువు వారు మాయందు కటాక్షించి పర్లాకిమిడి డిప్యూటీ తహశ్శిలుదారు వారి తావుకు మా అర్జీ పంపించి వారివల్ల సదరు కాట్రగడనాయుడు రయితులను విచారించి వార్సుదారు కలంలో మాఅన్న తగ్గించియున్న మాముగ్గురు పేర్లు నమోజా చేయించి మాసమిష్టిని పట్టా దయచేయించుటకు ఆర్డరు జారీ చేయించ గలందులకు ప్రార్థన.

1300 ఫసలీవరకు మాగాని హెడ్డులో చేరి ఆ ఫసలీ మార్చిలో ధారాళ ముగా నీరు యెక్కడము యిబ్బందిగలభూమి అపుటచేత మామూలు ప్రకారం విడుదలబుట్టగా భూములు బంజరుగా వున్నందుకు, యింజనీయరువారు 1301 ఫసలీ సెప్టెంబరునెలలో వచ్చిన కృష్ణవరదకు కపిలేశ్వరపు కాల్వగట్టు తెగబడడము వల్ల అమీనుపురము వగయిరా గ్రామములకు యీ కాల్వనీరు అగత్యములేకుండా అరేంజిచేసి, మా గ్రామమయిన గరికపర్రు మెరకవాలు భూములకు ఆ సంవత్సర మునకు మాత్రము అడ్డివేసుకొని నీరు వుపయోగపర్చుకోవలసినదిగా శ్రీయింజనీ

యరు యిలాకావారు మూజువాని వుత్తర్వు యిప్పించినారు. ఆ ప్రకారం నమ్మి సకాలములో దరఖాస్తులుచేసి సాగు చేసుకున్నాము. సాగు చేసికొన్న కొన్ని దినములకు డెల్టా సూపరింటెండెంటుగారు మా గ్రామ కరణమును పిలిపించుకొని సాలుగుజస్తాబాపతు విడుదలపెట్టి దరఖాస్తులు చేసినభూములకున్ను 1301 ఫసలీసాలున నూతనముగా చేసిన దరఖాస్తు భూములకున్ను స్టేటుమెంటు దాఖలు చేసుకొని వున్నారు. మేము సాగుచేసికొని సదరు భూములు ఫలింపజేసుకొని యున్నాము. ఇట్టి సంగతిలో 1301 ఫసలీ సాలుకు కిస్తిబంది ప్రకారం మామూలుగా రు4-0-0 లు తీర్వయున్ను రోడ్డు ఫండుయున్ను వసూలుచేసి జమాబంది అయిన యిరవయి రోజులకు యింతుతో దాఖలుచేసిన పట్లీకు సె 2 రు యే గుర్తునకలు దాఖలా ముగ్గురు ఆసామీల భూములకున్ను తక్కిన కరణము లెఖ దాఖలలో అసామీవారి భూములకున్ను జమాబందిలో య 1కి రు 6-0-0 లు తీర్వ కట్టినారు అని గ్రామమునసబు కరణములు మిగిలిన రు 2 లు తీర్వయున్ను వసూలు చేసినారు. మేము దరఖాస్తు చేసికొన్నప్పుడు తహాశ్శిలుదారు వారుకాని, తహాశ్శిలుదారుగారు డెల్టావారికిపంపిన స్టేటుమెంటు ప్రకారం తసికి చిత్తగించినప్పుడు వారుగాని, మమ్మున యీ భూములు సాగు మంజూరుచాయలేదని వుత్తరువులు యిప్పించి యుండలేరు. అధికార్ల వుత్తరువులు ఆయాసకాలములో మాకు తెలియక యీచిన్న్ చివరకు కలగడంచాత గుజస్తాకేగాక యింతటనుంచికూడా అన్యాయం సంప్రాప్తమయినది. గనుక మా మొర విచారణచేయించి సాలుగుజస్తా తీర్వ మాపు చేయించి మంజూరు యిప్పించవలసినదనిన్ని యీ 1301 ఫసలీనుండి యీ భూములకు య 1కి రు4-0-0 చొప్పున తీర్వ మాపు చేయించవలసిన దనిన్ని దీనులమయిన రయితులము ప్రార్థిస్తున్నాము.

## Translation.

The durkhast application submitted on 11th July 1876 in respect of wet land No. 264 in Nelatur village measuring 5 acres 34 cents assessed at Rs. 29-9-0 was kept pending for 2 faslis and the said land assigned on the third of March 1879, by the Tahsildar after the expiry of the cultivation season; and the waste has been charged at the time of settlement on the 18th March. I, therefore, submit as follows: the said land has not been assigned in time for cultivation and possession taken only on the first of April 1879; I

వీరు చూచుటకు అసహ్యముగనుండు తలవెంట్రుకలు పొడుగుగ పెంచి తల పైని సిగచుట్టుకొందురు. మొల కొక గుడ్డ చుట్టుకొందురు. అనేక రంగులతోని గుడ్డలతో కుట్టిన పడి సంచికూడ ఒకటుండును. వీరి స్త్రీలు చిప్పలతోను గవ్వలతోను పలు రంగులు గల పూసలతోను కూర్చబడిన దండలను మెడయందు ధరింతురు. వీరు కన్నపు చోరీలు చేయుటలో నేర్పరులు. చోరీచేసిన సొత్తులలో వస్తువులను తమ మకామునకు దూరమందుండు మరుగు ప్రదేశములలో తెల్లవారకమునుపే పాతిపెట్టి నగదు మాత్రం పట్టుకొని నెమ్మదిగ తమ గుడిసెల కేగుదురు. పశువుల చోరి విశేషముగ చేయుదురు. ఆయుధమునకై ఉక్కు పొన్నులుగల ఇనుప పనిముట్టు వుపయోగింతురు. వీరు సాధారణముగ నేరము ఎకరరుపడరు. దొంగసొత్తు జలదారుల లోను గడ్డివాములలోను నూతులలోను దాతురు.

2. ఒక మాగాణి పంట భూమిలో మెరక పంట పైరు చేయబడినపుడు, సంవత్సరములో పల్లపు పైరుకు నీళ్లు పెట్టుకొదగిన యే కాలమునందైనా జలాధారములో నీళ్లు వున్నయెడల, మామూలు మాగాణి శిస్తు కట్టబడును. అయితే, నీళ్లు సరఫరా చేయబడకుండినను, నీళ్లు వుపయోగించుటకు వీలు లేనప్పుడు సరఫరా చేయబడినను, లేదా పల్లపు పైరు పెంచుటకు చాలినంత సరఫరా చేయబడకుండినను, చేనుకు నీళ్లు పెట్టకపోయినయెడల, మెరక శిస్తేకట్టబడును. మెరక పయిరుకు నీళ్లు పారింపబడినయెడల, కలెక్టరు తన యిష్టానుసారము, ఆ పొలము యావత్తుమీద పూర్తి పల్లపు శిస్తుగాని యావత్తు పొలము మీద మెరక శిస్తు తోపాటు వాస్తవముగ నీళ్లు పారింపబడిన విస్తీర్ణము మీద ఆ పైరుకు నిర్ణయింపబడిన నీటి పన్నునుగాని కట్టవచ్చును. అయితే ఈ రెండవ సందర్భములో, యిట్లా కనిపికట్టిన శిస్తు, యావత్తు పొలము మీద కట్టే ఒక పల్లపు శిస్తుకు మించగూడదు.

3. గడచిన జనవరి నెలలో తిరుచనాపల్లి జిల్లా సమయపరము అను నూరిలో జరిగిన జంతు ప్రదర్శనమున చుట్టు ప్రక్కలయందుండు గ్రామములనుండి మైసూరు రాజ్యమందుండియు అనేక వేలకొలది పశువులు దీసుక రాబడినవి. వాటిలో మైసూరు నందుండి తేబడినవి పెక్కు చక్కనైయుండెను. ఆ ప్రదర్శనమునకు అగ్రాసనాధిపతియైయుండిన డాల్రింపిల్ హే అను దొరవారు పశువుల సంరక్షణను గురించి గడచిన సంవత్సరములలో జేసిన యుపన్యాసముల వెంబడించి కొన్ని విషయములు నుడివిరి. అవియేవి యనిన, "పశువుల నడుకడుకు దూడ లీనునట్లు జేయుట వాటికి మిక్కిలి చెఱుపును గలిగించును. పశువుల యొక్క పాలు పొదు

గుల విషయమై యధిక జాగ్రత గలిగియుండవలయును. ఈనుటపమునుపు పశువునకు పొదుగు బలిసి యందుచేత యసౌఖ్యముగా యున్నదని దోచినయెడల యప్పుడే పాలును పిండివేయుట మంచిది. ఆ వాపును తగ్గించనియెడల పశువునకు కష్టమధికమై యీసునప్పుడది శాంతముగాయుండుట వదలి మోటుతనము కలిగియుండును.”

4. ఈ సంవత్సరములో సకాల వర్షము లేనందున కొన్ని మెట్ట గ్రామాదులలో పంట లేత అయినది, కొన్నిచోట్ల భూమి దున్నడమునకు ప్రయత్నం చేసినప్పటికి భూమి బిగుసుకొని వున్నందున నాగటి కర్ర భూమిలో బాగుగ దిగక నాగలిసాలు పడుటయే కష్టమయినది. నువ్వు, బొబ్బర, మినుము, ఆముదాలు వీట్లకు తెగులు తగిలినది. వెర్రి తలలు వేసి చాలాభాగము చెడిపోయినది. ప్రూనాస బాగుగనే యున్నది. మామూలు పల్లం బాబతు పల్లంభూములుసాగు విషయములో కాల్వల నీరు సకాలములో వచ్చినందున ఆకు మళ్ళు వేసుకొనుటచే ఆకు అక్కరకువచ్చి నాటు వెయ్యబడ్డది జమీందారీ వూళ్ళలో కొన్నిటిలో అగ్రాహారీకులకున్ను జమీందారుకున్ను పుట్ల కట్టుబడి విషయమైన తకరరు ఫయిసలు కానందున వాళ్ళ భూములకు నీటి దరఖాస్తులు చేయక సాగుబడి చెయ్యలేదు. గత ఫసలీలలో సాగు అయిన కొన్ని భూములు యీ సంవత్సరం కొల్లేటి ముంపులో నున్నందున సాగు కాలేదు. చిన్నవాడ గ్రామంలో వుండే అనాది బంజరు భూములకు యీ సంవత్సరం కొందరు పాయకారి రయితులు దరఖాస్తులు చేసుకొని వున్నందుకు మంజూరు నిమిత్తము యేలిన వారికి విశదపరుచుకొనియుంటే వుత్తరువచ్చి యుండనందున సాగు కాలేదు. పొరంబోకులలో నుండే మోతరఫాను గురించి యీ సంవత్సరము కలాలీలు కట్టుకట్టి దరఖాస్తులు చేసియుండలేదు. కసబు కాలంకూడా మించిపోయినది. నీలి ఆకు బాగా వున్నది. యీ సంవత్సరం ధర కలిగియున్నందున మొదటి కోతలోనే ఆసామికి చాలా లాభంవచ్చినది. నీలి తోట్లకు యెంతమాత్రం విరామం లేకుండా పని జరుగుతున్నది.

5. మనకు చంద్రపాటి శ్రోత్రియంలోవుండు కొన్న మక్తా భూములు అన్ని ప్రస్తుతం పరాయీల పాలయిపోతూవున్నవి. ఎట్లాగంటే ముందు మనకు మక్తా వహిని కవులు యిచ్చిన ఆ శ్రోత్రియుందార్లు యీసాల్ ఖరువున అనగా యీ ఆషాఢ శుద్ధ 5 లనాడు నాగుల అప్పన్న వద్ద యెచ్చు మక్తా మొకరరు చేసుకొని అతనికి కవులు వ్రాసి యిచ్చి రిజిస్టరున్ను చేయించినారు. ఆ వర్తమానం శాస్త్రు తెలిసి మొన్న కొంచం వానకురిసి పదనుపడగానే ములుం తోటలో బాధక

పంపు దుక్కి దున్నేకోసరం అరకలు తోలుకొని జీతకాండ్లతోకూడా నేనున్న పోతిని. పోయినంతలో నాగుల అప్పన్న మన అరకలు మళ్ళ దోలించి నేను యిజాఫా శిస్తు కింద మక్తా ఐహీని కవులు పుచ్చుకొని వున్నాను యీ తోట సాగుబడి హక్కు నాకేగాని మీకు లేదు అన్నాడు. కానాసేపు పోరాడినప్పటికిన్ని తోట కంతకూడా తియ్యనివ్వక పోయినాడు. అంతట నేను వానితో పోరాడ లేక శ్రోత్రియందార్ల వద్దకుపోయి యేమి యిట్లు జేసినారే యిది సరా అని యడిగితే వాళ్ళు "మీ అన్న అమాని ఐహీ నేగాని మక్తానహీని తాను సాగుబడి చేయ చాలను అని చెప్పినాడు. అందువల్ల మీ కవులు తీరక పోయినప్పటికిన్ని మేము వేరే కవులు యిచ్చుకొన్నాము. మరిన్ని అతడు మాకు యిజాఫా కట్నం యిచ్చేటట్టు ఒప్పుకొన్నాడు. ఎల్లీవల్లన మీకు కవుల్లిచ్చి తెల్లవారి లేస్తే కచ్చాకూతలు కూసుకొంటూ వుండేదానికంటే కావలెనన్న వాళ్ళకు యిచ్చి యెచ్చు కట్నం పుచ్చుకోవడం సరో కాదో నీవే యోచించుకో" అన్నారు. వారిమీద తోడు తోనే సమ్మేరి దావా అయినాచేసి భూములు దఖలు చేసుకొందామంటే వాళ్ళు యిచ్చిన ముచ్చలికా యెక్కడపెట్టి పోయినారో యెక్కడ వెదికినా చిక్క లేదు. ఇప్పుడు కొంచము తొలకరించి మక్కికి. మంచి కోపుగా వున్నది. ఇప్పట్లో దుక్కికి ఖరువు చేయకపోతే పుబ్బ కార్తెలో చల్ల కానికి పొలము లాయఖుపడదు. ఆజూబాజూ తోటలేమి మాగాణి భూమిలేమి దున్నుతూ వున్నారు. మరిన్ని జరీబు భూములన్ని దున్ని పాగనార నాటుతూవున్నారు. ఈ సమయంలో చేతులోవున్న పొలం నాచుకొని కజ్జా కోర్లయిన పగవాండ్లు లేని పోని ముత్తబీలు పన్ని యిబ్బందీలు పెట్టుతూవున్నారు. అందుకు తగినట్లు యెదురు మొహరా చేసేటందుకు నాకు తగిన మద్దత్తుగాని సలహాదార్లుగాని లేక పోవడంవల్ల యెందు కున్నా పాలుపోక కలాట్లు పడుతూవున్నాను.

6 నళనామ సంవత్సరం జేష్ఠ శుద్ధ తదియనాడు పుట్టిన తనఖా కవులలో నుదహరించిన మక్తా బాబత్తు మావులూరు సుబ్బయ్యగారికి అచ్చవలసినందుకు యిదివరకే తమ వద్ద బదలు పుచ్చుకొన్న రొఖం ౨౭౨, కుటుంబపోషణార్థం దఫాలవారీగా ప్రాంసరి నోట్లు పైన మీవద్ద నేను పుచ్చుకొన్న కుల్లు మొత్తం రూ ౧౪౯, నిరుడు నాకోరు భూములు సాగు చేయుటకుగాను తమ పేరట తాకట్టు పత్రం వ్రాసియిచ్చి తీసుకొన్న రూ. ౭౫ వెరశి రూపాయలు (౫౦౦) అయిదువందలు యిందుకు వడ్డీ రూ ౧౦౦ కి నెల ౧-కి ౧॥ చొప్పున చేరే అసలు

ఫాయిదాలకు యీడుగా పెట్టివుంజే స్థావరాస్తి వివరం ఓంగోలు సబ్ డిస్ట్రిక్టులో చేరిన వల్లూరు గ్రామంలో కోరు మాగాణి సర్వే నెంబరు ౨౧౩ వి స్తీర్ణం యే. ౧-౨౮ సెంట్లు యిందుకు సరిహద్దులు తూర్పున గొబ్బురతోట, పడమర డొంక, దక్షిణం దంఘుదారి, వుత్తరం వాగున్ను సాగచముడు కర్రయున్ను.

## English Translation.

1. They are called koravas by the Tamilians (in the south). In the north they are known as Korachas, and Erukulas in the circars. These are the offspring of one of the largest tamil class of theives in India. They live by committing dacoities. Ordinarily they halt outside villages. They usually select dry places with hillocks. They grow their ugly hair on the head long and roll round the tuft on the head. They wear a cloth round their loins. There will also be a slinged pouch sewn with various colored cloths. Their females wear necklaces strung with shells, cowries and variegated beads. These are expert house-breakers. Of the proceeds of the thefts, they will bury the properties in concealed places near their camp and coolly go to their huts only with the ready money. They will commit cattle thefts widely. For their weapon, they use an iron implement rimmed with steel. Ordinarily they will not confess their crime. They will conceal the stolen property in drains, hay-ricks and wells.

2. When a dry crop is raised on a single-crop wet land, and when water is available in the season in the irrigation source, ordinary wet assessment will be imposed. But if irrigation has never been supplied, or supplied when not possible to supply it, or when not supplied sufficient for the requirements of crop and if the field is not irrigated, only a dry assesssment will be charged. In the matter of irrigation of dry lands, the collector may, at his discretion charge wet assessment on the whole extent of the field, or, in addition to the dry assessment on the extent of the whole extent of the field, charge the water-rate prescribed for the crop on the actual extent irrigated. However, in the latter case, the consolidated assessment as above, should not exceed the single wet assessment on the whole land.

3. On the occasion of the cattle show held in January last at Samayavaram in the Trichinopoly District, thousands of Cows

were brought from the adjoining villages and the Mysore Province. Among them, those from the Mysore Province were the best. Mr. Darlymple Hay, the President of the said show, made some suggestions following the lines of his lectures delivered in the past year in the matter of cattle preservation (breeding.) They are— "Causing them to calve frequently would do them much harm. Great care should be taken in the matter of the milk udders. Prior to calving if the cow's udder appear distended resulting in discomfort to the cow, it would be well to milk the cow immediately. If the swelling be not reduced, the labour will be intense for the cow, and when calving it will not be calm but vicious."

4. Owing to the failure of the timely rains, the crops are young in the villages in drier parts; in spite of endeavours to plough the land, the soil was hardened and the ploughshare could not sufficiently sink into the ground and furrows could not be made out. The gingelly, a black species of pulse, black gram and castor plants have become blighted. The wild melon has for the most part been damaged. In the matter of the cultivation of the immemorially wet lands and those brought under wet cultivation, as water was available in time in the irrigation channels, seed beds were prepared and the seedlings have matured and been transplanted. The dispute between the beneficiaries and the zemindar in respect of the rent based upon the outturn remained unsettled, and they have not applied for water to cultivate those lands in some of the zemin villages. Some lands cultivated in the last fasli became submerged in the waterspread of the Colair; these have been left waste in the current fasli. The applications made in the current year for the immemorial waste lands in Chinnivada by some temporary tenants were submitted for approval to the higher authorities; as orders have not been received thereon, those lands were not cultivated. The abkari renters have entered into a combination among themselves in the matter of the payment of the tree-tax on palmyras and have not applied therefor. The toddy-drawing season has also expired. The indigo plant is flourishing. As the price was high this year, the ryot has derived good profit in the first cutting alone. The indigo vats are being worked incessantly.

5. Our lands on fixed rent in Chandrapati Shrotriam are being appropriated by others. The shrotriemdars, who leased the

lands on fixed rent, had, at the beginning of the fasli, i-e., on the fifth day of the bright lunar fortnight of Ashada (June—July), leased them to Nagula Appanna for a fixed enhanced rent and executed a registered lease deed. Having learnt the affair, and it having rained a little the day before yesterday, I went in season taking ploughs with bullocks and servants to plough the land known as Badanapampu. When I went, Nagula Appanna drove our ploughs with bullocks out of the land saying that he had leased the land for enhanced rent and none but he has any right to the garden land in question. Although I strived for a sufficiently long time he went away restraining me from even opening the way of ingress into the land. Unable to contend with him, I went to the shrotriemdars who, when questioned by me as to the propriety of their action, said your elder brother expressed that he would not cultivate it on fixed rent but only on Amani (for share in the produce), and thereupon we leased it to another though your lease remains un-expired. Moreover the new lessee has promised to pay us enhanced rent. You had better consider whether it is right or wrong to lease the land to those who require it for an enhanced rent in lieu of leasing it to you who are unwilling and who prattle now and then." When I thought of filing a summary suit against them immediately to come by the possession of the lands, the muchilika issued by them was not found though everywhere searched. It is not well suited for the first ploughiug. In case ploughing is not commenced now, it will not be fit for sowing in the month of Ashada when the moon is in the first mansion. The adjoining garden lands and the wet lands are being ploughed. The garden lands have also been ploughed and are being transplanted with tobacco and hemp. At this time, having snatched away the lands from us, our rowdy enemies devise vain trickeries and submit us to difficulties. There being no one to assist or counsel me in opposing them, I am undergoing difficulties without undertaking anything.

6. For the amount payable to Mavuloor Subbayya towards the fixed rent referred to in the assignment deed dated the third of the third lunar month in the Nala year, the amount of loan taken from you is Rs. 276, the total of the amounts received from you on the promissory notes for the maintenance of the family is Rs 149, the

amount received from you for cultivating lands in my tenancy on the mortgage deed executed in your favour, Rs 75, in all Rs 500 (Rupees five hundred). The particulars of the immoveable properties mortgaged for the above principal and interst thereon at one rupee per month per hundred is survey No. 813, measuring 1 acre and 24 cents of wet tenancy land in Vallur Village of Ongole sub-District, bounded on the east by the cocoanut garden, on the west by a cattle-path, on the south by a high road and on the north by a torrent and a bush of prickly-pear.

## 1921.

1. మారి లేక మసురు జాడ్యము (Rinderpest or cattle plague), ఈ దేశపు అనేకభాగములలో తఱచుగా తటస్థించునట్టియు ప్రాణాంతకమైనట్టియు జాడ్యము. ఒక జంతువుకు రోగపు అంటుసోకిన తర్వాత ఒకవారము మొదలు పదునాలుగు దినములవఱకు అది జబ్బుపడును. మందలో శీఘ్రముగా ఆవ్యాధి వ్యాపించును. రోగముయొక్క సరియైన స్వభావమునుగుఱించి ఆరంభములో చెప్పుట కష్టము, కాని, పోనుపోను మిక్కిలిస్పష్టమైన లక్షణములు కనబడును వీనిలో ఎత్తు పడునటుజేయు మిక్కిలి యధికమైనబలహీనత: శరీరముయొక్క మాంసకండరములు వింతగా కొంకరలు పోవుట తఱచుగా నెత్తురుతో కలిసి పాఱుకొన్న పేడ మిక్కిలి కంపుతోను ఒకవిధమైన వాసనతోను విస్తారముగ పాఱుకొనుట, ముక్కు నోరు వీటి లోతట్టు చర్మము మీదను ఆడజంతువుయొక్క అవయవములను పాల పొదుగును కప్పియుండు వాని వంటి చర్మము యొక్క కొన్ని భాగముల మీదను ఉండు సన్నపాటి బొబ్బలు, మిక్కిలి వింతైన దగ్గును, సాధారణముగానుండును. చచ్చిన తర్వాత ప్రేగులు, పొట్టలు, ఇవి ముఖ్యముగా రోగపూరితమయినట్లు కనబడును. చెడురక్తపు నాడులనుండి వెడలిన నెత్తుటి మఱకలు పెద్దవి శరీరము యొక్క నానా భాగములలో కనబడును. పశువులకు ఈ వ్యాధి సంభవించును. వానినుండిగొఱ్ఱెలకు కలుగవచ్చును. ఇది మిక్కిలి సోకుడు వ్యాధి. దీనిని సామాన్యపు రక్త విరేచనము లనుకొని భ్రమపడకూడదు. రక్త విరేచనములు కలిగినప్పుడు నోటియందు బొబ్బలు ఉండవు. మఱియు ఇకమీద చెప్పబోవు రోగమువంటిదే యని కూడ భ్రమపడకూడదు. ఆ రోగము వల్ల అపాయము మిక్కిలి తక్కువ.

2. ఇప్పటికి సుమారు యిరువై రోజుల క్రిందట దీపావళీ పండుగ యింకా మూడు రోజులున్నదనగా వకజయవారము నాడు ప్రొద్దున అంబల్లు పూట, నేను,

నాగ్రాసవాండ్లు, కమతవాండ్లు, నాయెద్దులు, నాగేలి వగయిరా కొరముట్లుతీసికొని యీవూరికి వాయవ్యమూలనవుండే నాడేల వాని బీ[illegible] అనే మడికి వెళ్లుచుంటిమి. వూరుదాటిన తర్వాత నాలుగుచేల పట్టుదూరములో మంగల నారిగాడు మాకు యెదురుబడ్డాడు. వానిని నేను పలుకరించడములో, తాను కావలియుండే తన తోట లో పసుల పిల్లవాండ్లు తమ పశువులను, గొర్రెలను తెచ్చి పైరు మేపను విడిచినారనిన్ని, తాను "మీ అమ్మ నాయాండ్లలారా యీలోసి అట్లా పసుల తోలుతారు మీ ఘాబల్లపడబిండి యెముకవిఱచి పంపెదను పసుల గొర్రెలను తోలుకొని పారిపొండి" అని అంటే వాండ్లు వినక తన మీదికి కట్టెలెత్తి పశులను యెగతోలినవి అను, తాను భయపడి తన అయ్యను యీ నడచిన వృత్తాంతము చెప్పుదామని పోతూవుండేట్టు చెప్పినాడు యింతలో వాని అయ్య, ఆయన తమ్ముడు, వాండ్ల మేనల్లుడున్ను యెగురుపడిరి. నారిగాడు తన అయ్యతో యీమారెడ్డి పసులవాండ్ల ఇల్ల మేపింపబడినదని చెప్పెను. అందరు కలిసి మడికాడికి పోతిమి. ముండ్ల వరి పయిరు బుదనికి మేపియుండిరి ఓరీ మీ యిండ్లు కాలిపోను, మీయాండ్ల ముండ మోయ, మీ కార్పణ్యం తిరిపెపు వానిపైన సాధించవలెనా? పయిరు నేలపాలు చేస్తిరి. అంటూ, నారిగాణి ఖామందు పసలవాండ్లవద్దే యుండిన యీమారెడ్డి కాడికిపోయెను. వార్లు వార్లు కలియబడిరి. ఒక్రెలతోను మేడితోకలతోను జపురుకొనిరి. మేము పదిబార్ల దూరములో ఉంటిమి. తర్వాత దగ్గిర పోయిచూస్తే మంగల నారిగాణి యజమానుడు క్రింద తేలకండ్లు వేసుకొని వెల్లలకపడియుండెను. ముక్కున చీమిడి కారుచుండెను. పొట్ట పగిలి నాలిక కఱచుకొని, నరాలు యెక్కడి దక్కడ నీలుగుకొనిపోయియుండెను. మాటలు తప్పిపోయి, తెలివితప్పియుండెను. అంతటసార్జెంటు జవానులు వచ్చి యీమారెడ్డిని ఖయిదుచేసుకొని బేడీలు వేసి నారిగాని యజమానున్ని ఒక నులకమంచముమీదనున్న తీసుకొని పోయిరి. స్టేషను చేరకాడికి ప్రొద్దు గ్రుంకిపోయి అచేతి గీతలు అగపడి పడకవుండినది.

3. రైతులు భూములు కొలుకు తీసుకొనెదమనునప్పుడెల్ల గ్రామోద్యోగస్థులు తహశీలుదార్లకు రిపోర్టు చేయవలయును. నాగజెముడుతోనిండియుండు బంజరు నేలమీద ఏమియు లేకుండ శుభ్రపఱచుటకొఱకు కలెక్టరు ఇష్టానుసారము ౨ సంవత్సరములనుండి 20 సంవత్సరములవరకు భేదించు కాలమునకు శిస్తు చెల్లించనక్కరలేనికాళ్లు ఇయ్యవచ్చును. దట్టపు అడవిగల భూమినిగాని లేక పర్త్రెలనుగాని లేక గడ్డితోనిండియుండెడు భూములనుగాని ఆబాదుపఱచుటకొఱకైనను పచ్చి ఎరువుకుగాను చెట్లను లేక పొదలను పెంచుకొఱకైనను మఱియు

అట్టివిశేష సంగతులలో అకైనను కాలము అప్పుడప్పుడు హెచ్చింపబడుచుండే బాబతు కాళ్లకూడ ఇయ్యవచ్చును.

4. ఒక హిందువు ఆతడు నేర్చిన విద్యవల్ల సంపాదించే సొత్తు సదరు విద్య సమిష్టి కుటుంబముయొక్క ద్రవ్యమును ఖర్చు పెట్టిగాని సమిష్టి కుటుంబములోచేరిన వాని ఉపాధ్యాయత్వము వగైరాలవల్లగాని నేర్పింపబడినదైనను అతనియొక్క ప్రత్యేకమైన సొత్తుగా భావింపబడేటట్లు చేయుటకై ఒక చిన్న చట్టము తయారుచేయబడి జనులయొక్క ఆక్షేపణనిమిత్తమై యున్న వారి సమ్మతా సమ్మతములను తెలుసుకొనుటకొరకై యున్న ప్రకటించినమీదట అది అంతటిలో మొదట అదు గంటేపోయెను. దానిలో 'విద్య' అనుమాటకు ప్రథమ శిక్షా సంబంధమైనను సరే, పూజ్యతగలదయినను సరే, సాంకేతికమైనను సరే, శాస్త్రసంబంధమైనను సరే, చదువు అనిన్ని, వర్తకము, కాయకష్టము, లేక జీవనోపాయము జరుపుటకు ఒకనికి శక్తిని కలిగించుటకు సాధారణముగా ఉద్దేశింపఁబడునట్టి యేవిధమైన తరిబీతు అయినా అనిన్ని, విద్యాదాయమను మాటకు విద్య ప్రధానమూలముగా సంపాదింపబడిన యాస్తు సొత్తు అనిన్ని, సదరు సంపాదన యీ చట్టము అమలులోకి వచ్చుటకు ముందుగా జరిగినను పిమ్మట జరిగినను సరే అనిన్ని, సదరు సంపాద్యము అట్టి విద్యయొక్క సామాన్యఫలితమైనను, అసామాన్యఫలితమైనను సరే; అనిన్ని అర్థము చేయబడినది.

5. దావా రశీదులోని దస్కతున్ను రెడ్డి అదే దినం యిచ్చిన యితర రశీదులతో మొకాబిలా చేయడములో అన్నిట్లలోను ఒకే విధమైన శిరాయి వుపయోగించబడియున్నది రెడ్డి దస్కతున్ను సరిపోయినది. కచ్చాఖిరిలోని మశిన్ని రశీదులలోని దస్కతుల మశిన్ని సరిపోయినది గనుక, సాంబి రెడ్డి రశీదులలోని దస్కతు రెడ్డిదే యని నేను నమ్మినాను. ఈరశీదు ప్రథమతః నూటయాభై యింటికి యివ్వబడినట్టు నేను యెంచలేదు. రెడ్డి గొప్పసంసారి. వేలకొలది అప్పుయిచ్చేవాడు. నూరు రూపాయలు సర్కారు ద్రవ్యము వాడుకోవలసిన అవసరము యితనికి తటస్తపడదు. ఇతని కచ్చాఖిర్ది నెల నెలకు తారీఖు వారిగా వుంచబడి, తేరీజులు వేయఁబడి దిద్దులు లేకుండా వుండడమే గాక, ప్రతి నెలలోనున్ను యిరసాలు తారీఖులలో మొత్తము క్రింద కరణం వల్ల దస్కతు చేయబడియున్నది. ఈ లెక్కలో రెడ్డి తప్పు దాఖలా చేశినాడనుటకు కారణము కనుపించదు. వివాద రశీదులో మొబర్లగు నూట అను మాటలు వకపంక్తిగానున్ను యాభై రూపాయలు అను మాటలు రెండవ పంక్తిగానున్ను వ్రాయబడియున్నది. యాభై రూపాయలకు

యివ్వబడిన రశీదులో మొదటి పంక్తి కడాపట నూటు అనుమాటను కలిపి అంకెల కలములో వొకటిగాను అంకెచేర్చి రశీదు తబ్దీలు చేయబడినట్టున్ను రెడ్డి భయపడి రశీదు పుడాయించినాడనిన్ని, నా తాత్పర్యము, భూతపు అద్దముతో పరీక్షించగా నా వూహా సరియని విశదమయినది.

6. (ఎ) ఏ సొత్తు నయినను, అది స్థిరాస్తికి చేరినదిగానుండినను 1882 వ సంవత్సరపు ఆక్టు యొక్క 23 వ సెక్షనునుబట్టి ఒక డిక్రీని అములు నెరవేర్చుటకయి చరాస్తిగా నెంచవలసియున్నట్టి విషయములో, ప్రెసిడెన్సీ స్మాల్ కాజ్ కోర్టువారు జప్తుచేసెడి యొక బుణప్రదాతను తీర్పు బుణస్థుని తాలూకు తాకట్టుదారునికినిగల వ్యవహార విషయమై అములు నెరవేర్చుటకొరకైన చర్యలలో హక్కు విషయమైన అంశములను గురించి వ్యవహరింపగూడదు, లేక అట్టి సొత్తుకు గల యేలాటి బాధ్యతనయినను సంబంధమునయినను నిర్ణయింపకూడదు.

(బి) తాబాకలం. నాకు పరమాత్ముని రామన్నకు జరిగిన జమా కర్చు విషయములో, గడచిన ఆషాఢ బహుళ విదియనాడు ఖుద్దున లెక్కచూచుకోగా అతనిపై తేలిన అధిక కర్చు మొత్తం రూపాయలు ౧౨౫౦ గరిమిలాను జరిగిన ఖాతా కింద ఏర్పడిన బాకి రూపాయలు ౫౦ కుల్లు రూపాయలు ౧౭౫౦ మింజుమలే నేటిదినం తాకట్టు పత్రం వ్రాసి యిచ్చినది ౧౫౦౦ పోను బాకీ రూపాయలు ౨౫౦ బదులుగా భావించవలసినదనిన్ని ఒకవారం రోజులలో అచ్చివేశేదిగా వాచా ఖరారు చేసినాడు.

## English Translation.

1. Rinderpest or cattle plague is a frequent and fatal disease in many parts of the country. A week to a fornight after an animal has been exposed to infection, he falls sick. The disorder rapidly spreads in a herd. It is difficult in the earliest stages to decide as to the exact nature of the disease, but later very marked symptoms set in. Of these extreme weakness amounting to prostration, remarkable twitchings of the muscles of the body, severe diarrhæa with very-foul and a peculiar smell of the matter passed, which is often mixed with blood eruptions of the internal membrane of the nose, mouth and certain parts of the skin, such as those covering the female organs and the udder, and a very strange cough, is generally present. After death, the bowels and stomachs are especially found

disceased, and large patches of blood which has escaped from the veins are found in different parts of the body. Cattle suffer from this disorder, and sheep can take it from them; it is highly communicable. It must not be confounded with simple dysentery, in which there is no eruption in the mouth, nor with the disease next described, which is much less serious.

2. About twenty days back, on a Tuesday three days prior to the last Deepavali day, at breakfast time, I and my dependants and labourers took the bulls, ploughs and other agricultural implements to the waste land known as Nadelas waste to the north-west of my village. We met barber Narigadu about four fields' distance from the village. In the course of my conversation with him, he informed me that grazing boys have allowed cattle and sheep damage the growing corn in the garden he was watching, that when he remonstrated with them saying "Are your mothers my wives, I shall squeeze and pull out your ears and break your bones, run away driving your cows and sheep" they heeded not to his warning and drove the cattle towards him with sticks in hand, and fearing their highhandedness he was on his way to imform his master of what had happened. By this time, his master arrived there with his younger brother and nephew. Narigadu told his master that (the corn) has been allowed to be grazed by Yama Reddi's grazing boys. We all went together to the field. (They) had the paddy crop grazed completely. The master of Narigadu said "Let your houses be burnt to ashes and your females turned widows; why should your malice be directed against a poor man ? you have ruined my crop," and advanced towards Yama Reddi who was with the grazing boys. Both parties fought and thrashed each other with ricks of corn and plough-tails. We were at a distance of ten shoulders' length. There after, going near, Narigadu's master was found on the ground lying on his back with eyes wide open and mucous was flowing out of the nose. The belly was rent, the tongue between the teeth, and the nerves all contracted. He had no power of speech and was unconscious. Soon afterwards, the Head constable and constables arrived, arrested and handcuffed Yama Reddi, and took Narigadu and his master placing them on a country bedstead.

3. Whenever ryots intend applying for lands on a cowle, the village officers should submit a report to the Tahsildar. Cowles free

of assessment varying in period from 5 to 20 years, at the discretion of the Collector, may be given for clearing waste land covered with prickly-pear. Progressive cowles may also be given for the reclamation of heavy jungle lands, of swamps, of land infested with grass, the cultivation of trees or shrubs for green manure or similar exceptional cases.

4. When a short bill to declare that all acquisitions made by a Hindu by means of his learning, whether that learning was imparted at the expense of the joint family or by tuition etc., of a member thereof, are his exclusive property, was drafted and published for the comprehension of the public in view to ascertain their assent or dissent thereto, it collapsed at the initial stage. By 'learning' was therein meant education whether elementary or liberal, technical or scientific, or any training whatever ordinarily intended to equip one for trade, manual labour or livelihood; and by 'gains of learning' was meant all acquisition to which education was the stepping-stone, whether made either prior or subsequent to the operation of the said Act, and whether the source of the gains is ordinary or extraordinary education.

5. In comparing the receipt in question with those granted by the munsiff on the same date, the ink was found to be the same. The signature of the munsiff agreed. The ink in the rough collection account also agreed with that of the signatures. I therefore concluded that the signature in the receipt produced by Sambi Reddi was that of the munsiff; but I do not hold that this receipt was originally granted for Rs. 150. The munsiff is a respectable householder. He has money-lending business to the extent of some thousands. There will be no occasion for him to utilise one hundred rupees of government money. His rough collection account has not only been written up from day to day, and month after month, the particulars and the amount noted without alterations, and is also every month signed by the Kurnam on the dates of remittances. It would not be reasonable to urge that the munsiff would have made a false entry in the account. In rendering in words the figures representing the amount in the receipt in question, the word hundred is in one line, and the words fifty rupees written in the second line. My idea is that the letters hundred (in Telugu) have been added in the first line of the receipt granted for Rs. 50, and

the figure 1 has been prefixed, that these alterations have been made in the receipt, and that the munsiff disowned the receipt from fear. When examined under a magnifying glass my surmise seems to be true.

6. (*a*) A Presidency Small Cause Court cannot, as between an attaching creditor and the mortgagee of the judgment debtor, deal in execution proccedings with questions of title to or determine any right to or interest in, property forming a portion of immoveable property, but which under sec. 28 of the Small Cause Courts Act, 1882, is for the purpose of the execution of a decree deemed to be moveable property.

(*b*) *Postscript*. On personally looking into the accounts with my most intimate friend Ramanna, on the second dark night of Ashada (July - August) month, it resulted in a debit of Rs 1650 against him; the subsequent transactions show Rs 90 as due by him, making up a total (debit) of Rs 1740. (Deducting) the part payment of Rs. 1500 in virtue of the mortgage deed executed this day, he agreed to treat Rs. 240 as (hand) loan to be repaid within a week.

## 1922.

1. మజాకూరు గ్రామములో వుండే పాపిరెడ్డిన్ని నేనున్ను కమతపు సేద్యమునకు ఆరంభించి యిప్పటికి నాలుగేండ్లుగా సేద్యము చేసుకొంటువున్నాము. అతడు యిప్పుడు కొందరు విరోధుల దుర్బోధనలవల్ల నన్ను తనకమతములో నుండి తొలగించదలచి మావుభయుల సాగుబడికిందవుండే భూములలో రెండు పల్లపు గుడ్డములు మాత్రము వదలి తక్కిన మెట్టమాగాణి భూమిలన్ని తానే కవ్వుకొన్నాడు. సేద్యపు కొరముట్లలో రెండు గుంటకలు, రెండు గొర్తిదండ్లు, రెండు కాండ్లు ఉమ్మడివై యుండగా అవన్ని తనవేయని జోరావరీ చేసి తీసుకొని తమిరె లేని కాడి ఒకటి మాత్ర మిచ్చి యదే నీది పొమ్మని చెప్పినాడు. అందు మీద నేను యీసంగతి గ్రామ మునసీపుతో మొరబెట్టుకొంటిని. ఆయన పాపిరెడ్డిచే లంచమేమో తీసుకొని అతని పక్షముగానే తీర్పు చేసినాడు. నేను అది అన్యాయ మని జగడమాడుతూ చెరువుగట్టుకు తూర్పుతట్టు మెట్టచేలో చెట్టుకొట్టపోగా, నాచేలో అడుగుపెట్టితివా నిన్ను అక్కడనే నరికి పూడ్చి పెదుదునని మెడపట్టితోసి; ఆ మరసనాడు నాగేటి కఱ్ఱు సరిపించుకోవడానికై వడ్రంగివాని యింటికి పోతూవుం

డగా మట్టిమానికాడ కూర్చునివుండి నన్ను చూచి వుచ్ఛావుచ్ఛములు తిట్టి ముల్లుకఱ్ఱతో వీపుమీద రెండు దెబ్బలు పెట్టి కబర్దారు పోపొమ్మన్నాడు. కనుక గ్రామమునసీబును ఆసరా చేసుకొని నన్ను అన్యాయముగా కొట్టి నాచేత భూమిని లాగుకొనవలెనని యత్నపడుతూ వుండే యీ పాపిరెడ్డి వల్ల నాకు యేవిధమైన బాధ రాకుండ నన్ను కాపాడుటయేగాక నాకు స్వాధీనపడునట్లు న్యాయము కలగచేయగలందులకై తమ ఘనతనుమిక్కిలి ప్రార్థిస్తున్నాను.

2. రయితులు తొలకరి వానలుకురియగానే, పునాస విత్తనములు వేయుదురు. జొన్న; వరి వగైరాతరద్దూదు ఖరువుకావలసినందుకు, వారు, దారునాదారు స్థితిని విచారించి, మోతుబరు రయితులకున్ను నాదార్లయిన ఆసాములకున్ను వారి వారికి తగినట్లు తకావి యిప్పించబడును. పాయకారీల రయితునభూములు కొన్నేండ్లయిన తరువాత కదీం పొలములలో దాఖలు చేయబడును. నీరు తక్కువయిన పక్షమందు జొన్న గొంతెమట్టుకుబొందుపోవును. ఇదిగాక ముందుకు కాబోవు పయిరు తరద్దూదుకు పొలములు మిక్కిలి రాక ఘనీభవించును.

3. ఈ వ్యాజ్యములో, ఖయిది తన స్వంత తల్లిని కొట్టియు తన్నియు చంపినాడు. క్రూరముగ కొట్టితన్నినందున మరణము సంభవించెనని సెషన్ జడ్జిగారు కనిపెట్టెను. అయితే మరణము కలుగవచ్చుననే యెరుకతో ఖయిది తనతల్లికి శరీరఘాతను కలిగించియుండునట్లూహించుటకు ఘాత బలమయినది లేదు గనుక అతని నేరముగల నరహత్యలోనుండి విడుదలచేసెను. ఖూనీ కానేరని నేరముగల నరహత్యనుండి అతనిని విడుదల చేయుటకు ఇది నిమిత్తము కానేరదనుట స్పష్టము. ఆయెరుక కలిగియుండిన, ఖయిదీ చర్య ఖూనీయగును. మరణమును కలిగింపగల శరీరఘాతచేయవలెనను తలంపుతో ఈ కార్యము జేయబడెనా యనుటయే జడ్జీగారు విమర్శింపవలసిన విషయము. ఒక దార్ఢ్యముగల మనిషివలన అరవై ఏయస్సుగల ముదిమి ఆడది క్రూరముగకొట్టి తన్నబడియు, తలవెంట్రుకలచే లాగబడెననియు, ఇటుజేసిన మనిషికి ఇసుమంత ఆగ్రహము కలుగుటకు కారణము లేదనియు జడ్జిగారు కనిపెట్టిరి. ఆ క్రూరమైన దొమ్మికిని మరణమునకును గల కారణకార్యసంబంధము నిస్సందేహమని స్థాపించబడియున్నది.

4. అర్జి మలూపులో నుదహరించిన ప్రకారం బోర్డువారు పల్లముగా తీర్మానించిన భూమి పరిమాణములు అనికట్టు నీరు ప్రవహించక పూర్వము తయారు అయివున్న లెక్కలలో నమోదు అవుతూవచ్చిన లెక్కలు తహ్వేలు మొత్తముల

రొక్క దృష్టాంతరముల మీద మొకద్దపడియుండుటచేత, తీరువానపు మొత్తము లను అనికట్టు నీటిసాగుబడియొక్క ద్వివిధపరిమాణములలో లెక్క పరిమాణము తహ్వేలు పరిమాణములలో మినహాయించడము న్యాయమయియుండగా అనికట్టి నీరు ప్రారంభమయిన ౧౩౨౦, ౧౩౨౧ ఫసలీలకు దరిమిలాను ౧౩౨౭ సంవత్సరం మొదలుకొని చేయబడిన మషాతు తహ్వేలు పరిమాణములో నుంచి మినహాయించ బడవలసినందును కలెక్టరువారు తాత్పర్యపడడమువల్ల మాకు అన్యాయము సంభవిం చడముకున్ను హేతువు అవుతూవున్నది.

5. తాకట్టు వుంచినవాడు యెందుకొరకు తాకట్టు వుంచెనో అట్టి ఋణ మునుగాని వాగ్దత్తమునుగాని వాయిదాకులోపుగా చెల్లించక, లేక నెరవేర్చక తప్పిపోయిన పక్షమందు, తాకట్టు వుంచుకొన్నవాడు సదరహీ ఋణముకుగాని వాగ్దత్తముకుగాని తాకట్టు వుంచిన వానిమీద వ్యాజ్యము తేవచ్చును; లేక తా కట్టు వుంచినవానికి యుక్తమైన గడువుయిచ్చి అట్లు యిచ్చినసంగతిని అతనికి రొ జుకచేసి తాకట్టువుంచబడ్డ వస్తువును అమ్మవచ్చును.

అట్టి అమ్మకమువల్ల వచ్చిన పయికము సదరహీ ఋణము విషయములోగాని వాగ్దత్తి విషయములోగాని యివ్వవలసిన మొత్తముకు తక్కువపడ్డ పక్షమందు, తాకట్టు వుంచినవాఁడు నిలవపయికమును చెల్లించడముకు యింకా పాత్రుడవు చున్నాడు. అమ్మకమువల్ల వచ్చిన పయికము అట్లా యివ్వవలసిన మొత్తముకు మించి వున్నపక్షమందు, తాకట్టు వుంచుకొన్నవాడు ఆ మిగతను తాకట్టు వుంచిన వానికి యివ్వవలసినది.

6. ఉద్దేశములయొక్కయు కారణములయొక్కయు వివరణము:—

గ్రామముల స్థానిక వ్యవహారములను పరిపాలించుటకొరకు పంచాయతీలను ఏర్పాటుచేయుట మేలని పరిపాలనవిభజనను గురించిన రాయలు కమిషనువారు చెప్పియుండిరి. స్థితిగతులు అనుకూలముగా నున్నప్పుడు పంచాయతీపద్ధతిని ప్రవే శపెట్టుటకు జాగ్రత్తగా ప్రయత్నము చేయవలయునని ఇండియా గవర్నమెంటు వారు ఒప్పుకొనిరి. ఈ విషయములో రెండు మార్గములుగా అభివృద్ధి చేయవచ్చు నని 1915 - 1916 వ సంవత్సరములో లోకలు గవర్నమెంటువారు తీర్మానించిరి. ఎట్లనగా:—

(ఎ) అనేక గ్రామములకు మైనరు యూనియను పంచాయతీలను లోకలు బోర్డు అక్టు ననుసరించి ఏర్పరుచుటకు వీలుకలుగునట్లుగా యూనియన్లకు సంబం ధించిన సదరు అక్టుయొక్క నిబంధనల ప్రయోగమును సులభపరుచుట, మరియు

(బి) అంతకంటే చిన్న గ్రామములో చట్ట సంబంధ అధికారము లేకుండ తమంత తాము ఏర్పడినస్వేచ్ఛానుసారమైన పంచాయతీలను సాధారణ కార్యములను చేసిచూడనిచ్చుట.

ముఖ్యముగా ఈ రెండవమార్గమున అభివృద్ధిపొందడములోను ఖానిగీ అడవి పంచాయతీల విషయములోను అమూల్యమైన అనుభవము అప్పటినుండి సంపాదింపబడినది. ఈ యడవిపంచాయతీలు, ఫారెస్టు కమిటీవారి సిఫారసులమీద, గవర్నమెంటువారు జారీచేసిన యుత్తరవుల పర్యవసానముగా అనేక జిల్లాలలో ఏర్పరుపబడినవి. దాదాపు ప్రతి జిల్లాలోను ఖానిగీ పంచాయతీలు స్థాపింపబడినవి. 1918 వ సంవత్సరాఖరున రాజధానిలో 1010 పంచాయతీలు పనిచేయుచుండినవి. వానిలో 319 గ్రామపు అడవులను విచారణ చేయుచుండినవి. తక్కినవి గ్రామ సంరక్షణ, ఆరోగ్యము, నీటిసప్లై వగైరాలవంటి సామాన్యమైన విషయములను గురించి విచారణ చేయుచుండినవి. వానివలన కలిగిన ఫలితములు నిరుత్సాహకరముగా నుండలేదు. కాని పన్నులు కట్టుటకు చట్టసంబంధపు అధికారములు లేనందునను తీర్మానములను అములు జరుపుటకు అధికారము లేనందునను వారి అభివృద్ధికి ప్రతిబంధముగానుండెను. ఈ లోపమును సవరించి పంచాయతీకి చట్ట సంబంధపు ఆధారము ఏర్పరుచుటయే యీ బిల్లు యొక్క యుద్దేశము. బిల్లును తయారు చేయుటలో 1918-వ సంవత్సరము మే నెల 16-న తారీఖుగల 41-వ నంబరు తీర్మానములో ఇండియా గవర్నమెంటువారు చేసిన సూచనలు దృష్టిపథమునందుంచుకోబడినవి.

## English Translation.

1. Since four years, Papi Reddi, a resident of the village and myself have been jointly carrying on cultivation. At the inducement of some of my enemies he has taken to oust me from partnership and to this end has illegally taken into his possession the dry and wet lands hitherto comprised in our partnership with the exception of two wet plots. Out of the agricultural implements, he has taken away by force two levelling instruments, two stumps of drill ploughs and two yokes though they were joint property, and has sent me away giving me a yoke without the pin in the centre which alone he said was mine. Thereupon I reported the matter to the village munsiff. Having received some bribe at the hands of Papi Reddi, he decided only in his favor. Inpugning the justice

in the matter, when I had gone to fell a tree in the dry land situated to the east of the tank bund, he pushed me by the neck saying "if you step into my land, I shall cut and bury you there." On the next day, while I was on my way to the carpenter's house to have the ploughshare mended, he was sitting at the banyan tree and called me all sorts of names and struck me twice or thrice on the back with a thorny stick threatening me "Beware, go, go." I pray that you will protect me from being submitted to any harm at the hands of Papi Reddi who, with the help of the village munsiff, beat me and is endeavouring to come by the lands in my possession, but also to cause justice to be administered so that I might regain my possession thereof.

2. When the first rains set in, the ryots will sow the first crop. To progress the cultivation of the great millet, paddy, and etc., the respective status, substantial or poor, of the ryots will be enquired into and money will be advanced to each adequately for the purchase of seed-grains and etc. The lands held by temporary tenants will after a few years be entered as 'ayan' lands. If water-supply be deficient, the great millet will become pithless. Moreover the soil of the lands to be cultivated in the future will become hardened and difficult to be ploughed.

3. In this case the prisoner killed his own mother by beating and kicking her. The Sessions judge found that the death resulted from a brutal beating and kicking, but acquitted him of culpable homicide because the violence was not such as the prisoner must have known to be likely to cause death. This is, it is manifest, not ground for acquitting him of culpable homicide not amounting to murder. With such a knowledge the act would be murder. The question for the judge was whether the act was done with the intention of causing bodily injury which was likely to cause death. The judge found the brutal beating and kicking and dragging by the hair of the head of an old woman of sixty by a powerful man who so acted without the smallest provocation. The causal connection between the brutal assault and the death is found to be undoubted.

4. As the extents concluded by the Board as being under wet cultivation—vide the enclosure hereto—have been assumed upon the comparative figures adopted from the figures compiled prior to

taking the anicut water for irrigation, it would be reasonable to deduct such extents from the two classes of extent cultivable from the anicut water as well as from the comparative figures extracted from the accounts ; but as the collector is of opinion that the extents will have to be deducted from the figures come to at the survey in fasli 1268, a long period subsequent to faslis 1260 and 1261 when the anicut water was first taken for irrigation, we are likely to be submitted to injustice.

5. If the pawnor makes default in payment of the debt on performance, at the stipulated time of the promise in respect of which the goods were pledged, the pawnee may bring a suit against the pawnor upon the debt or promise; or he may sell the thing pledged, on giving the pawnor reasonable notice of the sale.

6. If the proceeds of such sale are less than the amount due in respect of the debt or promise, the pawnor is still liable to pay the balance. If the proceeds of the sale are greater than the amount so due, the pawnee shall pay over the surplus to the pawnor.

7. Statement of the objects and reasons:—

The Royal Decentralization Commission has expressed that it would be advantageous to establish panchayats for administering the local affairs in villages. The Government of India accepted to carefully endeavour to introduce the panchayat system when circumstances are favourable. The Local government resolved in 1915-1916 to contribute to progress in this direction in two ways:—

(a) To facilitate the application of the provisions of the said Act in connection with the Unions so as to afford scope to introduce minor unions and Panchayats for several villages with reference to the Local Boards' Act, and

(b) To allow self-constituted and independent panchayats, in the absence of legislative jurisdiction, transact ordinary matters in even smaller villages. Ample experience has been gained since then especially in attaining progress in the second method and in the matter of punchayats for private forests. As the result of the orders issued by Government on the recommendation of the Forest Committee, these forest panchayats have been constituted in several districts. In a short time, private panchayats were constituted in every district. At the end of 1918 there were 1010

panchayats working in the Presidency. Out of them, 319 were managing village forests. The rest were controlling village protection, health, water-supply and other ordinary matters. The results thereof were not unencouraging, though the absence of legislative power to levy taxes and execute judgments were impediments to their progress. To make up for these omissions and make legislative provision for punchayats is the object of this Bill. In drafting the bill the suggestions of the Government of India contained in their resolution No. 41, dated 16th May 1918, were had in view.

## 1923.

1. మహారాజరాజశ్రీ యేలినవారి సముఖానకు — వైద్యనాధపురం కాపురస్తుడయిన బండారు శేషడు వ్రాసుకున్న మనవి అర్జి యేమంటె పూర్వం మాపెద్దలు కాశికిపోయి గంగాస్నానంచేశి అక్కడనుంచి తీర్థ ప్రసాదములు తీసుకునివచ్చి మహారాజశ్రీ యేలినవారి సముఖంలో యిచ్చి యేలినవారి అనుగ్రహం సంపాయించుకుని తదనంతరం రామేశ్వర యాత్ర చేసుకొని అక్కడనుంచి తీర్థప్రసాదములు తీసుకునివచ్చి సముఖంలో యిచ్చి బహుమందికుటుంబం కలవారము మాకు యెక్కడనైనా కొంచెం భూజీవనం దయచెయ్యమని అనేకదినములు సముఖంలో కొలువు కొలిచి మనివి చేసుకున్న పిమ్మట కేవలం అరణ్యంగా వుండే యీతలూరు వల్లేడు పొలిమేర సందున కొంచెం భూమి వైద్యనాధపురమనే పేరు పెట్టి ఖండ్రికగా యేర్పరచి మా పెద్దలకు దయచేశినారు. అక్కడ యిండ్లు కట్టుకొని చెర్వులు బావులు ఫలవృక్షాలు యేర్పరచుకొని కొంతమంది రయితులను చేర్చుకొని సాగుబడి చేసుకొని అనుభవిస్తూవుండి యీవల సర్కారుకు యేర్పరచిన జోడీగూడా అచ్చుకుంటూ అనేక దినములనుంచి అనుభవిస్తూవుండి మా పెద్దలు కాలంచేసిన తర్వాత క్షామోపద్రవాదులకు యీ దేశంలో నిర్వహించజాలక అన్నానకు మిక్కిలి కష్టపడి పశ్చిమ రాజ్యంపోయి యిన్నాళ్ళదాక అక్కడ కాలక్షేపం చేసుకొని తిరగా యేలినవారి పాదపద్మముల సన్నిధికి షుమారు నెల రోజులనాడు మాపిల్లకాయలు మేము వచ్చిచేరినాము. ఇక్కడికి మేము వచ్చి మా జీవనం విచారించుకునే వరకు కురుమెటి పాపన్నకు అనుభవ మవుతున్నట్టుగా తెలిశినది. అనేక దినములనుంచి మా పెద్దలు మేము అనుభవిస్తూవుండె జీవనం అన్యధా కావడంవల్ల మాకు యేఆధారమూ లేక యేమీ తోచక యేలినవారి పాదపద్మముల సముఖానకు

మనవి వ్రాసుకొన్నాను. కటాక్షించి మా జీవనం మాకు దయచేసి మాకుటుంబ పోషణ చెయ్యవలెనని మిక్కిలి కోరి మనవి వ్రాసుకున్నాను. యేలినవారి పాదకట్నం ౧౫౦ రూపాయలు కట్నంగా చెల్లించుకుంటున్నాను. అనేకతరములనుంచి మేము అనుభవిస్తూవున్న జీవనం గనుక నాయందు పుత్రవాత్సల్యతచాత విచారించి నన్ను రక్షించవలెను. చిత్తగించవలెను. అర్జి తప్పులు క్షమకాయకర్తలు.

2. 1858 వ సంవత్సరమున ఏవియో కొన్ని పట్టణములందును కంటోనుమెంటులందును తప్ప ఇతర ప్రదేశములందు ఆరోగ్య సంస్కారమునకై కృషి యేమియు చేయబడలేదు ; మఱియు దేశమందు సంభవించు మరణములను వ్యాధులను గుఱించిన విషయములను తెలిసికొనుటకు ప్రయత్నము లేవియు చేయబడలేదు. కడచిన 50 సంవత్సరములకాలములో, మరణములను, మరణ కారణములను, జననములను రిజిస్టరు చేయుపద్ధతి దాదాపుగాహిందూ దేశమందెల్లెడల క్రమక్రమముగా వాడుకలోనికి తేబడెను. కొన్ని రాష్ట్రములలోను అనేక గొప్ప పట్టణములలోను సదరు రిజిస్టరు దాఖలాలు ఇప్పుడు సాధ్యమైనంత వఱకు సరిగానే ఉన్నవి ; ఇదిగాక, నానా ప్రదేశములందుండు జనులలో కలుగు మరణములను గూర్చియు వ్యాధులను గూర్చియు ఉపయోగకరమైన విషయాంశము లనేకములు సంపాదింపబడుచున్నవి. దేశమాత్రము మునిసిపలు ఏర్పాట్లు చేయబడియున్న నగరము లన్నిటిలోను పట్టణము లన్నిటిలోను ఆరోగ్య విషయిక సంస్కారములు చేయబడుచున్నవి ; కడచిన 20 సంవత్సరముల కాలములో ఓడల రాకపోకలకు ఆధారమైన పట్టణములందును ఇతర ముఖ్యస్థానములందును ఈ విషయమై నిజమైన యభివృద్ధిచేయబడినది. గవర్నమెంటువారి వద్ద ఋణముగా పుచ్చుకొన్న సొమ్ము ఖర్చు పెట్టి మునిసిపాలిటీలలో నీటి వసతికిగాను చేయబడిన పనులు జయప్రదముగా జరుగుచున్నవి. 80 కంటె అధిక సంఖ్యగల మునిసిపలు పట్టణములలో ఇప్పుడు నీటి సప్లయికి తగిన యేర్పాట్లు చేయబడియున్నవి. వానిలో అనేకములు బ్రహ్మాండముగా నుండుటయేగాక సుప్రసిద్ధములైన నవీనపద్ధతుల ననుసరించి నిర్మింపబడియున్నవి. అయినప్పటికిని, అనేక పట్టణములందేగాక కలకత్తా, బొంబాయి, మదరాసు నగరములందు కూడ అనారోగ్య కారణము లింకను పాతుకొనియున్నందున నివారణచేయుటకు సాధ్యమైన యనేక వ్యాధులును మరణములును ఇంకను సంభవించుచునేయున్నవి. సామాన్యముగా ప్రజలందఱియొక్కయు, అందు ముఖ్యముగా గొప్ప పట్టణములందు నివసించువారియొక్కయు, ఆరోగ్య స్థితిని అభివృద్ధిచేయుట ఆగత్యమను విషయమును, 1896-వ సంవత్సరమునుండి

హిందూ దేశమును కొల్ల పెట్టుచున్న ప్లేగు (మహామారి) అనుఘోరమైన వ్యాధియే దృఢపఱుచుచున్నది. ఈ విషయమునకుగాను మునిసిపాలిటీలకు ఇప్పుడు జెనరల్ రివిన్యూలనుండి సహాయద్రవ్యము ధారాళముగా ఇయ్యబడుచున్నది; మఱియు, హిందూ దేశములోని పట్టణములలో నివసించు జనుల ఆరోగ్యమును గుఱించిన విషయములందు విశేష శ్రద్ధయు అనుభవజ్ఞులగువారి తెలివియు వినియోగింపబడు చున్నవి. దీనివల్ల త్వరలోనే మేలు కలుగవచ్చుననియెంచవచ్చును. గ్రామములలో ఆరోగ్యాభివృద్ధికై చేయబడు పనులు చాలా తక్కువగా నున్నవనియే చెప్పవలసి యున్నది. అక్కడ ఈవిషయమున అభివృద్ధికలుగకుండుటకు, ప్రదేశపన్నులు చాల కపోవుట, ప్రదేశాధికార్లవద్ద కావలసినంతమంది ఉద్యోగస్థులు లేకుండుట, గ్రామస్థులందు చిరకాలముగా పీఠముగట్టుకొనియున్న దురాచారములు, దురభిమానములు, మొదలగు ఆటంకములుకొన్ని బాధించుచున్నవి. మశూచికము స్పష్టముగా తగ్గియున్నను, గవర్నమెంటువారి సింకోనా తోటలనుండి క్వైనను అను ఔషధమును చౌకగా ఇప్పించుటవల్ల జ్వరములు తగ్గియున్నను, కలరా వ్యాధియును జ్వరములును అంతగా తగ్గినవని చెప్పుటకు వీలు లేదు. సానిటరీ ఆఫీసర్లు చేయుపనులను విచారించుకొనుటకు ఒక్కొక్క రాష్ట్రమునందును సానిటరీ కమీషనర్లు బోర్డులో ఏర్పాటుచేయబడినవి. హిందూ దేశమందలి గ్రామాదులలో ఆరోగ్యమునకు సంబంధించిన విషయములను సవిస్తారముగా విచారించుకొను అధికారము జిల్లా అధికారులకును సంఘములకును గ్రామాధికారులకును సంఘములకును ఇయ్యబడియున్నది. ఈ సంఘములు సర్వజన సమ్మతమైనవిగాను జనాభిప్రాయమును చక్కగా తెలియజేయునవిగాను ఉన్నవి ఈ సంఘములకు అనుభవము కలిగినకొలదిని, వాని ఆదాయము వృద్ధియైన కొలదిని జనారోగ్యమును అభివృద్ధి చేయుటకు కావలసిన ప్రయత్నములకు పూనుకొనుటకు వారు మరింత సంసిద్ధులు కాగలరు. గ్రామస్థులు కూడ, ఆరోగ్యాభివృద్ధి విషయమున ఉదాసీనులై యుండుటను మాని, దానివల్ల కలుగగల లాభములు ఇట్టివని తెలిసికొనుచున్నారనుటకు సూచనలు కనుపడు చున్నవి,

3. ఎఱువుపెట్టక యేటేట నేల మంచి పంటల నీయదు. ఏజంతువైనను మేతయు నీళ్లును పెట్టకపోయినయెడల బ్రతుకనేరదని యందరకును తెలిసినయంశమే. అట్లనె మొక్కలకు నాహార మిచ్చుచుండవలెను. మొక్కలు తమంత గాలినుండి సంపాదించుకొన నేరని తిండి పదార్థముల నెఱువు రూపముగా నిచ్చుచుండవలెను. మంచి పట్టున పశువుల కాహార మెట్లు సిద్ధముగా నుండునో యట్లనే

యీ మొక్కతిండివస్తువులు సామాన్యముగా నేలయందు సిద్ధముగా నుండును. కాని కొన్నికొన్ని నేలలందు మాత్ర మీ వస్తువులు చాలకుండును. అట్టిసమయము లందే మొక్కలకు పైన చెప్పిన రీతిని తిండి కల్పించవలయును. అట్లు నేలయం దాహారము దొరికినప్పుడే గాలినుండి కావలసిన యాహారవస్తువులను మొక్కలు తీసికొనజాలి వృద్ధి పొందకలవు. ఎఱువు పెట్టుట యనగా మొక్కల కాహారము పెట్టుట యనియర్థము. రయితుల కీపనియొక్క యక్కర ఎంత చక్కగా బోధప డినదో యీ క్రింది సామెతలవలన తెలియును. "ఎఱువు వుంటే వెఱ్ఱివాడు సేద్యకాడె" మఱియు "పెంట కుప్ప పెఱిగితే పేదరయితు పెద్దగును."

4. పుత్రునకుఁ దండ్రితోఁ బంచుకొనుటవలన సొత్తు సంక్రమించునా లేక తండ్రి యనంతరము సంక్రమించునా లేక పుట్టుకతోనే సంక్రమించునా యను విషయము మితాక్షర ధర్మశాస్త్రమున నెక్కుడుగ విమర్శింపబడినది. అం దలి యభిప్రాయముల నిట్లు వివరించెదను. కుటుంబ సంరక్షణార్థమై సమయాసమ యముల ననుసరించి చరాస్తిని వ్యయమొనర్చుటకుఁ దండ్రికి సంపూర్ణస్వాతంత్ర్య మలవడియున్నను జన్మమువలననే ప్రతి పురుష వ్యక్తికిని బిత్రార్జితమున నధికార మలవడునని నిశ్చయింపఁబడినది. స్థిరాస్తిని తండ్రి తన పుత్రులయొక్కయు నితర భాగస్వాములయొక్కయు ననుమతికి లోబడిగాని వినిమయ మొనర్ప నధికారము లేదు. స్వార్జితమునందుఁగూడ తండ్రికి స్వాతంత్ర్యములేదు. ఒక పురుషుఁడు స్థిరవసతిని పశ్వాదిగణంబును దాను స్వయముగ సంపాదించినను సమష్టి కుటుంబము నందున్నంతకాలము పుత్రులు మున్నగువారి యభిమతమును బడయకయే వ్యయమొ నర్ప నధికారములేదు. ఇట్లేల విధింపఁబడినదన జనించినవారును ముందు జనింపబో వువారును గర్భస్థులై యున్నవారును గూడ స్వపోషణార్థమై స్వాస్థ్యమును గలిగి యుండవలెను. కావునఁ గలదానిని విక్రయింపరాదు. దాన మొసంగఁగూడదు. పితృదేవకార్యాచరణమునను మహాదాపద తటస్థించినపుడను గుటుంబ పోషణము కును ద్రవ్యము వలయునప్పుడు తక్కంగలవారి యనుజ్ఞను బడయకున్నను స్థిరాస్థి ని గూడ విక్రయింపనగును.

5. కో ఆపరేషను అనగా సాముదాయకముగా కార్యములు నెఱవేర్చు కొనుట. అన్నివిధములయిన అభివృద్ధులకు నిది కుంకుటివేరువంటిది. అందులో సర్కారువారి చట్టప్రకారము ఆమోదించి అమలు జరుపుచున్నవి పరపతి సంఘ ములు స్టోర్లు. పరపతి సంఘములు మెంబర్లకు నూటికి మూప్పావులా చొప్పున

అప్పులిచ్చి, ఇతర ఋణబాధలనుంచి తొలగించుచున్నవి. అప్పు వాయిదాల పైని తీర్చుకొనుచున్నవి. ఇట్టి సంఘము లిప్పు డక్కడక్కడ నున్నవి. అవి ప్రతి పట్టణములోను, ప్రతి గ్రామము గ్రూపున నొకటి చొప్పునను ఉండవలెను. వీటివలననిపుడు అప్పులో మునిగియున్న రయితులు ఆ బాధలనుండి తప్పించుకొనవచ్చును. కూడబెట్టిన సొమ్ము భద్రముగా నీసంఘములలో దాచుకొనవచ్చును. తగిన ధరవచ్చిన వరకు పండిన పంటలను నిలవచేసికొని, లాభముగా నున్నప్పుడు అమ్మవచ్చును. ఇప్పటిలో సాహుకారులు (గ్రామములోని ధనవంతులు, పట్టణములలోని వర్తకులు) వస్తువులు తమచేతిలో చిక్కువరకు ధరలను హెచ్చనీయక, తరువాత ఫలము పాడినట్టుగా దినదినము ధరలు పొడిగించుచున్నారు. ప్రతి గ్రామములోను పండినపంటలో ఆ గ్రామస్థులకు సంవత్సర గ్రాసమునకు విత్తులకు పశువులకు తగినంతమట్టుకు గ్రామములో నిలవవుంచి మిగిలినది ఎగుమతి చేసిన యెడల ప్రజలకు కష్టముగానుండదు: పంటలు సాహుకారులుస్వాధీనములో నుండుటంబట్టి యిట్టి యేర్పాటు చేయుటకు వీలు లేకున్నది. అనేకమంది రయితులకు సాహుకారుఅప్పు తీర్పగా రెండు మూడు నెలల గ్రాసమయిన నుండదు. సంవత్సరమునకు తొమ్మిది నెలల కాలము ఎక్కువ వడ్డికి అప్పు తెచ్చి హెచ్చుధరలలో వస్తువులు కొని కాలక్షేపముచేయు రయితుల కష్టములు వర్ణించనక్కరలేదు. రయితుల నిట్టి బాధలనుండి తప్పించగలవి పరిపతి సంఘములు తప్ప వేరేవియుగాన రావు. ఈ సంఘములలో చేరి పనిచేసిన రానురాను, ఇప్పుడు గ్రామములలోనున్న కక్షలుపోయి సంఘీభావము ఐకమత్యము అభివృద్ధి కాగలవు. కోఆపరేటివు స్టోర్లు (దుకాణములు) కో ఆపరేటివు ధాన్యపు బ్యాంకులు ఏర్పడిన యెడల నిప్పుడు మధ్యవర్తకులకు పోవుచున్న లాభములు ప్రజలే పొందగలరు ; ధరలును ఇంతగా హెచ్చవు.

## English Translation.

*To His Highness——*

*The petition of Bandaru Sesha, a resident of Vaithyanatha puram :—*

Previously my ancestors went to Benares, bathed in the Ganges and presented to your highness the sacred water and the offerings and secured your highness' favor. Thereafter, they went on pilgrimage to Ramesvaram and presenting the sacred water and

offerings to your highness, waited upon your highness for a long time, soliciting the grant of (an extent of) land anywhere for the subsistence of our large family. Thereafter your highness has assigned to them an extent of land on a favorable tenure between the limits of Ithaloor and Valledu which had been a mere forest, naming it as Vaithyanathapuram. They built houses, constructed tanks and wells, planted fruit trees, secured a number of tenants, cultivated and enjoyed (the land) for a long time, paying the jodi fixed upon it. After their demise, not being able here to endure the effects of the famine and suffering for our subsistence, we went to the western country where we passed our time till now and duly presented ourselves with our children before (the lotus feet of) your highness a month previous to now. After coming here, when we enquired about our (basis for) livelihood, it is known that Kurmeti Papanna is enjoying the land. As the land in the long enjoyment of our ancestors and ourselves has been otherwise disposed of, we have no support and not knowing what to do, I took to address your highness. Therein I prayed that your highness will with compassion bestow our land upon us and contribute to the maintenance of our family. I will remit Rs. 150 as a present to your highness. As the land has been enjoyed by us generation after generation, (I request that) it may be enquired into with a parental feeling and that I may be protected. Please to consider this. Please excuse the faults in the petition.

2. In 1858, no endeavour has been made, except in some towns and cantonments, in the direction of securing the health (of the people); and no attempts were made to ascertain the matters connected with the deaths and diseases in the country. During the past fifteen years, the system of the registration of the deaths, their dates and the births has been gradually brought to work almost throughout India. In some provinces and many larger towns, the entries in the said registers are now as far as possible correct; notwithstanding this, innumerable useful particulars are being secured regarding the deaths and the diseases among the people of different districts. Health measures are being taken in the cities and towns in which Municipal arrangements have been made even to a small extent; during the period of the past 20 years, genuine progress has been made in this respect in the towns and other

